# సూక్తి సుధాకరము






కూర్పరి, అనువాదకుడు,
సాహిత్య విద్యాప్రవీణ, తెలుగు భాషా ప్రవీణ
**ఆలపాటి వెంకటప్పయ్య, బి.ఎ.,**
రిటైర్డ్ సంస్కృతాంధ్రాధ్యాపకులు
యస్. బి. కె. ఓ. కళాశాల, తాడికొండ, గుంటూరు (జిల్లా)



సచ్చిదానంద సదనము

ప్రథమ ముద్రణము : 1992

ప్రతులు : 1000



వెల : రు. **15-00**

ప్రతులకు :

1. సచ్చిదానంద సదనము

C/o. ప్రియదర్శిని రెసిడెన్షెల్ జూనియర్ కాలేజ్

ప్రసాదంపాడు, ఏలూరురోడ్, విజయవాడ

2. C/o. డా॥ యన్. జవహర్‌లాల్

స్టేట్ బ్యాంకు దగ్గర,
రైలుపేట, రేపల్లె, గుంటూరుజిల్లా
Pin. : 522 265.

ముద్రణ :

శ్రీ లక్ష్మీ గణపతి ప్రింటర్స్

లక్ష్మీ డీలక్స్ రోడ్, తెనాలి.

# అంకితము

విద్యార్థుల యోగక్షేమములు, విద్యాభివృద్ధియే ప్రధానలక్ష్యములుగా చేసికొని, పలుకష్టములకు ఓర్చి, స్వీయసౌఖ్యమునుకూడ గణింపక, కళాశాలయే తమ సర్వస్వముగా భావించి, అందరి విద్యార్థులను తమ బిడ్డలుగా నెంచి, వారి విద్యా-వ్యక్తిత్వవికాసాభివృద్ధులకై నిరంతరము కృషిచేయునట్టియు, అధ్యాపకులు, తదితరోద్యోగులను ఆత్మీయులుగా పరిగణించి, మన్నించి, ఆదరించుచు, సహజ సరళ స్వభావము గలిగి సచ్ఛీలముతో నొప్పు, విద్యారణ్య [ప్రియదర్శినీ] రెసిడెన్షిల్ జూనియర్ కాలేజ్ యొక్క వర్గమునకు త్రికరణశుద్ధిలో సవినయముగా అంకితము గావించుచున్నాను.

పాలకవర్గ సభ్యులు :

శ్రీ మల్లిపెద్ది రాధాకృష్ణ
శ్రీ తూనుగుంట్ల సత్యనారాయణ
శ్రీ నెక్కలపు సాంబశివరావు M. Sc., B. Ed.,
శ్రీ వేజెండ్ల వెంకటలక్ష్మీ ప్రసాద్ M. Sc., B. L. Sc.,
శ్రీ యార్లగడ్డ వెంకటేశ్వరరావు M. Sc.,
శ్రీ యలమంచలి వెంకటేశ్వరరావు M. Sc.

వీరికి ఆయురారోగ్య-ఐశ్వర్యాది సకల శుభములను, సర్వశక్తులను సమకూర్చి సంపూర్ణ లక్ష్యము సిద్ధింపటచేయుకై సచ్చిదానంద స్వరూపుఁడగు పరాత్పరుని మనసార ప్రార్థించుచున్నాను.

ఇట్లు
సకలహితైషి,
బుధజన విధేయుడు
ఆలపాటి వెంకటప్పయ్య

# సూక్తి సుధాకరము

## ప్రథమ భాగము

### ప్రార్థన

శ్రీరమ్యః సచ్చిదానందః సర్వాత్మా జగదీశ్వరః।
* సర్వదో మాధవః పాయా [1]ద్యు [2]క్తశక్తిం ప్రదాయ మే॥

లక్ష్మీదేవితో కూడి సర్వజనుల మనస్సుల నాకర్షించుచున్నవాడును, సత్-చిత్-ఆనంద స్వరూపుడును, సమస్తమునకును ఆత్మయైన వాడును, లోకేశ్వరుడును, భక్తుల కోర్కెలను దీర్చువాడును అగు మాధవుడు-లక్ష్మీ భర్త యగు విష్ణువు- నాకు సముచితసామర్థ్యము నిచ్చి రక్షించుగాక.

శోభచే సకల జనుల మనస్సులను ఆకర్షించువాడును, సచ్చిదానంద రూపుడును, సకలాత్ముడును, లోకేశ్వరుడును అగు పార్వతీభర్తయగు శివుడు నాకు సముచితశక్తినిచ్చి ఎల్లప్పుడును రక్షించునుగాక.

శ్రీధవుఁ డసురారి శ్రీరమ్యరూపుండు
భక్తవశుఁడు లోకభారవహుఁడు
ఆద్యుఁ డచ్యుతుం డనాది-మధ్య-లయుఁడు
కరుణఁ జూపి నన్నుఁ గాచుగాత

---

* సర్వదః, మాధవః అని విష్ణుపక్షమున; "సర్వదా+ఉమాధవః అని శివుని పక్షమునను పదవిభాగము.

1. సమస్తము ఇచ్చు (విష్ణువు) సర్వదా+ఉమాధవః = ఎల్ల వేళల; శివుడు; 2. తగిన;

తా॥ రాక్షసులకు శత్రువు, సౌందర్యముచే మనోహరుడును, భక్త జనులకు వశమైయుండువాడును, సర్వలోకముల భారమును మోయువాడును, అందరికిని అన్నిటికిని, ఆదియై యున్నవాడును, తనస్థానము నుండి తొలగని వాడును. తనకు ఆదియు, మధ్యము, అంతము లేనివాడును అగు మాధవుడు కరుణించి నన్నురక్షించుగాక.

—వినతి—

ఆ. వె. సంస్కృతాంధ్రకవుల సద్బుద్ధి వినుతింతు
వారికైత కిడుదు వందనములు
మహితకవుల బోధ మనసార స్మరియింతు
సకలనరుల కాప్తజనులు వారు.

తా॥ సంస్కృత కవులను ఆంధ్రకవులను మంచి మనస్సుతో స్తుతింతును. వారలు రచించిన మహిత గ్రంథములకు వందనము లర్పించెదను. సకల జనుల హితము గోరుచు ఆప్తులై యొప్పు మహాకవుల బోధను మనసార స్మరింతును.

ఆ. వె. మందబుద్ధి నగుదు మహితకవిని గాదు
సాహసించి నాదు శక్తికొలఁది
నీతిసారమహిమ నెమ్మది గ్రహియించి
తెనుఁగు బాస గూర్తు తేటపడఁగ.

తా॥ నేను మందమతినే గాని గొప్పకవినిగాదు. నీతి సారము యొక్క మహిమను నిండుమనస్సుతో గ్రహించి సాహసము చూపి నాశక్తి కొలది స్పష్టముగా తెలుగు భాషలో రచియింతును.

ఆ. వె. సత్య మౌను తల్లి జ్ఞాన మౌ జనకుండు
ధర్మ మౌను భ్రాత దయయె సఖుడు
శాంతి యౌను భార్య, [1]క్షమ యౌను పుత్రుండు
[2]ఆప్తబంధువు లిల నార్గు రండ్రు. 1

తా॥ సత్యమే తల్లి. జ్ఞానమే తండ్రి. ధర్మమే సోదరుఁడు. దయయే మిత్రుఁడు, శాంతియే భార్య. ఓర్మియే పుత్రుడు. తల్లి బిడ్డను కాపాడునట్లు సత్యము ఎల్ల వేళలందు జనులను కాపాడును. తండ్రి బిడ్డలకు పోషణ-రక్షణలు కల్పించు నట్లు జ్ఞానము జనులకు పోషణ-రక్షణలను సమకూర్చును. జను లాచరించు ధర్మము సోదరుని వలె తోడై యుండును. జనులలో నుండు దయాగుణమే మంచి మిత్రునివలె కష్టసుఖము లందు వారిననుసరించుచుండును. శాంతి లక్షణము భార్యవలె జనుల కన్ని విషయములందును చేదోడుగా నుండును. క్షమా గుణము తండ్రికి పుత్రునివలె జనులకు సహాయపడి వంశమునకు ఉన్నతి కల్గించును. కనుకనే తెలిసిన పెద్దలు పై దెల్పిన ఆరు లక్షణములనే తల్లి, తండ్రి మొదలగు ఆరుగురైన ఆప్తులగు ఆత్మబంధువులుగా పేర్కొన్నారు.

సం॥ సత్యం మాతా పితా జ్ఞానం ధర్మో భ్రాతా దయా సఖా,
శాంతిః పత్నీ క్షమా పుత్రః షడేతే మమ బాంధవాః.

ఆ. వె. [1]దివికి భూషణంబు [2]దీపించు చంద్రుడౌ
సతికి భూషణంబు పతియె సుమ్ము
భువికి భూషణంబు [3]పుడమిపతియు, కాఁగ
జనుల భూషణంబు చదువె యగును. 2

---

1-1. ఓర్పు 2. మేలుగోరు

2-1. ఆకాశమునకు 2. ప్రకాశించు .3 రాజు

తా॥ ప్రకాశించు చంద్రుడే ఆకాశమునకు అలంకారము. భర్తయే భార్యకలంకారము. రాజే భూమికి అలంకారము. చదువే జనులకు అలంకారము. అనగా చంద్రుడు లేని రాత్రియు, పతిలేని సతియు, రాజులేని రాజ్యమును, చదువులేని జనులను ప్రకాశింపరని భావము.

సం॥ నభసో భూషణం చంద్రః నారీణాం భూషణం పతిః,
పృథివ్యాః భూషణం రాజా విద్యా సర్వస్య భూషణమ్.

ఆ. వె. [1]క్షణము విడువకుండఁ జదువు నేర్వవలయు
[2]కణము విడువకుండ [3] కలిమిఁ గూర్పు
క్షణము విడువ నరుఁడు చదువు నందుట యెట్లు?
కణము విడువ [4]కలిమిగడన యెట్లు? 3

తా॥ చదువు నేర్చుకొనువాడు క్షణకాలము యొక్క విలువను కూడ గుర్తించి క్షణమును వ్యర్థపుచ్చక చదువుకొనవలయును. అట్లే కొంచెము వెల గలిగిన దానిని విడిచినచో కలిమి పెరుగదు. క్షణములను నిర్లక్ష్యము చేయు నేటి అలవాటే తరువాత దినములను గూడ నిర్లక్ష్యము చేయుటకు మూలమగును. అట్టివానికి విద్య పట్టిల్లదు. అట్లే నేడు కణములను నిర్లక్ష్యము చేయువాడు కాలక్రమమున పెద్ద మొత్తములను కూడ నిర్లక్ష్యము చేయగలడు. కనుక అట్టివాడు కలిమిని వృద్ధిపరచలేడు.

సం॥ క్షణశః కణశశ్చైవ విద్యా మర్థం చ సాధయేత్,
క్షణత్యాగే కుతో విద్యా కణత్యాగే కుతో ధనమ్.

---

3-1. నాలుగు నిముసముల కాలము 2. లేశము (అల్పమూల్యముగల నాణెము) 3. సంపద 4 ధన సంపాదనము

ఆ. వె. సౌఖ్య [1]మరయు వారు చదువు పీడవలయు
విద్య నేర్వ సుఖము విడువవలయు
సుఖము నందఁ గోర [2]శూన్య మగును విద్య
విద్య నందఁ గోర [3]వెడలు సుఖము. 4

తా॥ సుఖమును పొందగోరువారు చదువుమానవలెను. విద్యనేర్చువారు సుఖము విడువవలెను. చదువు నేర్చు కాలమున సుఖమును ఆసించినచో చదువురాదు. చదువు పడయఁగోరిన వారికి సుఖ ముండదు. అనగా చదువు నేర్చెడు కాలమునందు కష్టపడవలెను. అప్పుడే సుఖము కావలెనన్న చదువు రానేరదు. కష్టపడి విద్య నేర్చినచో తరువాత వారు ఆ విద్యచేతనే సుఖము పొందగలరు. విద్యనేర్చుటకు కష్టపడని వారికి చదువు బాగుగరాదు కనుక వారు తరువాత కాలమున విద్య రానందున కష్టముల పాలగుదురని భావము.

సం॥ సుఖార్థీ చేత్ త్యజే ద్విద్యాం విద్యార్థీ చేత్ త్యజేత్ సుఖమ్,
సుఖార్థినః కుతో విద్యా కుతో విద్యార్థినః సుఖమ్.

ఆ. వె. గ్రంథకోటులందు [1]గ్రథిత మౌ నర్థంబు
పలికె వ్యాసుఁ [2]డర్ధ పద్య మందె
పరుల [3]కుపకరింపఁ బరమపుణ్య మగును
పరుల [4]కపకరింప పాప మగును. 5

---

4-1. వెదకు, విచారించు. 2. పాడైనది 3. తొలఁగు

5-1. కూర్పబడినది, 2. సగము పద్యమునందె, 3. ఉపకారముచేయ 4. అపకారముచేయ.

తా॥ అనేక గ్రంథములందు చెప్పబడిన సారాంశమును వ్యాస మహర్షి సగము పద్యమున ఇమిడ్చి చెప్పినాడు. "పరులకు ఉపకారము చేయుటచే పుణ్యము (మేలు) కలుగును అపకారము చేసిన పాపము కలుగును" అనునదే ఆ సారాంశము.

సం॥ శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథ కోటిషు,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

ఆ.వె. [1]సాహసంబు, బుద్ధి, [2]శౌర్యంబు, శక్తియున్,
తనరు [3]నుద్యమంబు, ధైర్య మనఁగ
ఆఱు లక్షణంబు లరయ నెచట నుండు
నచట దైవ మెపుడు [4]నలరుచుండు. 6

తా॥ ఎవని యందు (1) సాహసము (2) బుద్ధిబలము (3) పరాక్రమము (4) సామర్థ్యము (5) తగిన ప్రయత్నము (6) ధైర్యము అను ఆఱు లక్షణములు ఒప్పుచుండునో అతనియందే దైవము అమరియుండును. మానవుఁడీ మంచి లక్షణములతో ఒప్పునపుడు అతనికి దైవాను గ్రహము తప్పక ఉండుననియు, మానవులు దైవానుగ్రహమును పొంద గోరుటకు ముందు తన వంతు కర్తవ్యముగ ఈ యాఱు లక్షణములను సమకూర్చుకొన వలెననియు ఇట తెలియదగు ముఖ్యాంశము.

సం॥ ఉద్యమః సాహసం ధైర్యం: బుద్ధి శక్తి: పరాక్రమః,
షడేతే యత్ర వర్తన్తే తత్ర దైవం ప్రసీదతి.

---

6-1. తెగువ 2. పరాక్రమము 3. ప్రయత్నము 4. ఒప్పుచుండు

ఆ.వె. ధర్మ [1]మొందు జయ మధర్మ మంద దెపుడు
సత్య మొందు జయ మసత్య [2]మరిది
క్షమయె పొందు జయము, కనఁగ క్రోధ మరిది
[3]సురలు పొందు జయ [4]మసురు [5]లరుదు. 7

తా॥ ధర్మము జయించును. అధర్మము జయము గనదు. సత్యము జయించును. అసత్యము జయించదు. ఓరిమి (క్షమ) జయించును. క్రోధము జయము గాంచదు. దేవతలు జయింతురు. రాక్షసులు జయింపరు.

సం॥ ధర్మో జయతి నా ధర్మః సత్యం జయతి నానృతమ్,
క్షమా జయతి న క్రోధో దేవో జయతి నాసురః.

ఆ.వె. కనఁగ మంత్ర మేది గాయత్రి సదృశంబు?
దాన మేది అన్న దాన సమము?
వ్రత మ దేది చూడ ద్వాదశీతుల్యంబు?
మహిని దైవ మేది మాతృసమము? 8

తా॥ గాయత్రీమంత్రముతో సమానమైన మంత్రముగాని, అన్నదానముతో సమానమైన దానముగాని, ద్వాదశీవ్రతములో సమానమైన వ్రతముగాని తల్లితో సమమైన దైవముగాని లోకమున లేనే లేదు.

సం॥ నా న్నోదకసమం దానం న తిథిర్ద్వాదశీసమా,
న గాయత్ర్యాః పరో మంత్రో న మాతుః పరదైవతమ్.

---

7-1. పొందు 2. దుర్లభము 3. దేవతలు 4 రాక్షసులు 5. పూర్వమంతగా జరుగనిది. (దుర్లభము)

ఆ.వె. బాల్యమందు విద్య [1]పట్టి చదువ లేదు
యౌవనమున ధన [2]మనార్జితంబు
పిదప పుణ్య మదియుఁ బ్రీతిఁ జేయ వయితి
[3]అంత్యశుభము నీకు నమరఁ గలదె? 9

తా॥ చిన్నతనమునందు పట్టుదలతో చదువు నేర్వ లేదు. యౌవన దశలో ధనమును సంపాదింపలేదు. తరువాత ప్రీతితో పుణ్య కార్యములను చేయ లేదు. అట్టి నీకు చివరిదశలో శుభము ఎట్లు అమరును? అమరదని భావము.

సం॥ ప్రథమే నార్జితా విద్యా ద్వితీయే నార్జితం ధనమ్,
తృతీయే న తపస్తప్తం చతుర్థే కిం కరిష్యసి.

ఆ. వె. అగ్ని శిశిరమందు నమృత మౌను ప్రజకు
[1]ఆప్తుఁ గనుట జనుల కమృత మగును
ప్రభుఁడు సత్కరింప ప్రజల కమృత మౌను
అరయ [2]క్షీరభుక్తి అమృత మగును. 10

తా॥ శిశిరఋతువు (చలికాలము) నందు ప్రజలకు అగ్నియే అమృత మగును. తన మేలు గోరు వారి దర్శనము జనుల కమృతమే అగును. రాజు సత్కరించె నేని ప్రజల కది అమృత మగును. పరికింప పాలతో భుజించుట జనుల కమృత మగును.

సం॥ అమృతం శిశిరే వహ్ని రమృతం ప్రియదర్శనమ్,
అమృతం రాజసన్మానం అమృతం క్షీరభోజనమ్.

---

9-1. పట్టుదల చూపి 2. సంపాదింపబడ లేదు 3. చివరి దశలో మేలు
10-1. మేలుగోరువానిని 2. పాలతోడి భోజనము

తే. గీ. సుతులు లేనివారి గృహము శూన్య మగును
మాన్యహితులు లేక దిశలు శూన్య మగును
[1]క్షోణి [2]బాలిశుహృదయంబు శూన్యమగును
చూడ [3]దుర్గతునకు నంత శూన్యమగును 11

తా॥ బిడ్డలు లేని వారికి యిల్లు, పూజ్యులగు ఆప్తజనులు లేని వారికి దిశలు, మూర్ఖుల హృదయమే శూన్యముగ నుండును. ఇక దరిద్రులకు అంతయు శూన్యమే యగును.

సం॥ అపుత్రస్య గృహం శూన్యం దిశ: శూన్యాస్త్వబాంధవా:
మూర్ఖస్య హృదయం శూన్యం సర్వశూన్యా దరిద్రతా.

తే. గీ. [1]అర్యమునినుండి ఆరోగ్య మందనౌ
అగ్నినుండియె సంపద నందవలయు
[2]అభవునుండియె జ్ఞానంబు నందవలయు
[3]అచ్యుతునినుండి మోక్షంబు నందవలయు 12

తా॥ సూర్యుని నుండి ఆరోగ్యమును, అగ్నినుండి శ్రియమును ఈశ్వరుని నుండి జ్ఞానమును, నారాయణుని నుండి మోక్షమును పొందవలెను.

సం॥ ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్ శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్,
జ్ఞానం మహేశ్వరా దిచ్ఛేత్ మోక్ష మిచ్ఛేజ్జనార్దనాత్,

తే. గీ. వంశకీర్తికై యొక్కని వదలఁదగును
వంశమును గ్రామకీర్తికై వదలఁ దగును

11-1. భువిపై 2. మూర్ఖుని 3. దరిద్రునకు, 12-1. సూర్యుని నుండి 2. ఈశ్వరుని 3. విష్ణువు నుండి.

పల్లె [1]సురదేశకీర్తికై వదలఁదగును.
[2]స్వశుభ [3]పరాశించి వసుధనే వదలఁదగును. 13

తా॥ వంశము యొక్క కీర్తినిఁ గోరి కుటుంబములో నొకనిని వదలుకొనఁ దగును. గ్రామము యొక్క కీర్తినిఁ గోరి వంశమునే విడువ దగును దేశము యొక్క కీర్తినిఁ గోరి గ్రామమునే వదల దగును. అనగా కుటుంబములోని ఒక వ్యక్తి కంటె కుటుంబ కీర్తియు, కుటుంబముకంటె గ్రామ కీర్తియు, గ్రామము కంటె దేశకీర్తియు గొప్పదని గ్రహింపవలెను. మరియు మోక్షము వంటి తన శుభమును గోరి ఈ లోకమునే త్యజింప దగును.

స॥ త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్,
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్.

ఆ. వె. [1]కులజు నరసి కన్యఁ గూర్పవలయు తండ్రి
నిఖిల విద్యల సుతు నింపవలయు
[2]వ్యసనమగ్నుఁ జేసి [3]పగతు వంచవలయు
[4]ధర్మ్య [5]మిష్ట [6]మొందఁ దలఁప వలయు 14

తా॥ తండ్రి మంచి కులములో బుట్టిన వరుని వెదకి తన కన్య నతని కీయ వలెను. కుమారుని అన్ని విద్యలతో పరిపూర్ణుని చేయవలెను. ఆపదలను కలిగించి శత్రువును లోఁబఱచు కొనవలెను. ధర్మము దప్పకుండ తన కోరికలను నెరవేర్చు కొనవలెను.

---

13-1. గొప్పదగు దేశకీర్తికై 2. మోక్షరూపమగు స్వలాభము 3. కోరి
14-1. మంచి కులములో బుట్టిన వానిని 2. ఆపదలలో మునిగినవానినిగ
3. శత్రువును 4. ధర్మము దప్పనిదగు 5. కోరికను 6. పొందుటకు.

సీ॥ సత్కులే యోజయేత్కన్యాం పుత్రం విద్యాసు యోజయేత్.
వ్యసనే యోజయేచ్ఛత్రుం ఇష్టం ధర్మేణ యోజయేత్

ఆ. వె. అశ్వ ముఖ్యగుణ ము దరయంగ [1]వడి యౌను
[2]దన్తి ముఖ్యగుణము [3]దానజలమె
[4]చాన ముఖ్యగుణము [5]జాణతనమె యౌను
[6]పూరుషైక గుణము [7]పౌరుషంబు. 15

తా॥ గుఱ్ఱమున కుండ దగిన ముఖ్యలక్షణము వేగముగా పరుగెత్తుటయే. ఏనుగున కుండ దగిన ముఖ్యలక్షణము మదజలమును స్రవించుటయే. వనిత కుండ దగిన ముఖ్యలక్షణము జాణతనమే. అట్లే పురుషున కుండ దగిన ముఖ్యలక్షణము పౌరుషము.

శ్లో॥ అశ్వస్య లక్షణం వేగో మదో మాతంగ లక్షణమ్,
చాతుర్యం లక్షణం నార్యాః, ఉద్యోగః పురుషలక్షణమ్.

ఆ. వె. తనకుఁ జెందు వాఁ డితఁ డతఁ [1]డన్యుఁ డనుచు
[2]అల్పమతులు చూతు రన్యజనుల
కడు [3]నుదారులకును [4]బుడమి యెంతయుఁ జూడ
ఒక కుటుంబ మనఁగ [5]నొప్పు బుద్ధి 16

తా॥ ఈ మనుజుఁడు తన వాఁడు. ఆ మనుజుఁడు పరులవాఁడు అను నట్లు అల్పబుద్ధి కలవారు కొందరు ఇతర జనులను చూచు చుందురు.

---

15-1. వేగము 2. ఏనుఁగు యొక్క 3. మదజలమె 4. వనిత 5. చాతుర్యము 6. పురుషుని ముఖ్యగుణము 7. మానవ ప్రయత్నము.

16-1. ఇతరుఁడు 2. తేలికబుద్ధికలవారు 3. గొప్పబుద్ధి గలవారికి, దాతలకు 4. భూమి 5. బుద్ధి-ఒప్పు

మిక్కిలి ఉదారబుద్ధి గలవారు లోకము నంతను ఒక్క కుటుంబముగ తలంతురు.

సం॥ అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్,

ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్,

ఆ. వె. తగిన [1]కృషిని చేయు దారిద్ర్య [2]మంత మౌ

[3]అమల జపమున [4]నఘ [5]మంతరించు

[6]మౌనమునను పోరు [7]మటుమాయు మౌ నిల

[8]జాగ్రతునకు భీతి [9]సమసిపోవు 17

తా॥ తగినట్టి కృషి చేసినచో దారిద్ర్యము తొలగి పోవును. నిర్మలమగు జపము చేసినచో పాపము నశించును. మారు మాట్లాడకుండుటచే జగడము కలుగదు. మెలకువతో నుండు వానికి భయ ముండదు.

సం॥ ఉద్యోగే నాస్తి దారిద్ర్యం జపతో నాస్తి పాతకమ్,

మౌనినః కలహో నాస్తి న భయం చాస్తి జాగ్రతః.

ఆ. వె. [1]అసురకుండు నెచట [2]నలరు విద్వాంసుండు

అచట నల్పమతియె [3]అర్చ్యుఁ డగును

పెద్ద చెట్లు లేని [4]పృథివి [5]నేరండంచె

మహితతరువు వయ్యు మదికిఁ [6]గ్రూర్చు 18

17-1. ప్రయత్నము 2. నశించును 3. నిర్మలమగు జపముచే 4. పాపము 5. నశించును 6. మాటాడకుండుటచే 7 నశించును 8. మేల్కొన్నవానికి 9. నశించును 18-1. దొరకకుండును 2. ఒప్పు 3. పూజ్యుఁడు 4. భువిపై 5. ఆముదపు జెట్టు 6. ఇష్టమగును

తా॥ ప్రసిద్ధ మగు విద్వాంసులు లేని ప్రదేశమందు అల్పమగు బుద్ధి కలవాఁడు కూడ పూజ్యుఁడగు చుండును. నీడ నిచ్చు పెద్ద చెట్లు లేని చోట చిన్నదైన ఆముదపుఁజెట్టు కూడ మహావృక్షముగ నెంచబడును.

సం॥ యత్ర విద్వజ్జనో నాస్తి శ్లాఘ్యస్తత్రాల్ప ధీరపి,
నిరస్తపాదపే దేశే ఏరండోఽపి ద్రుమాయతే.

ఆ. వె. సుగుణవంతుఁడైన సుతుఁ డొక్కఁడే చాలు
దుర్గుణు లగు సుతులు నూర్గు రేల ?
చంద్రుఁ డొక్కఁ డుండ జగతికే [1]చక్షువౌ
పెక్కు చుక్కల [2]నిశి [3]వెలుగఁ గలదె ? 19

తా॥ మంచి గుణములు గల కొడుకొక్కఁడైనను చాలు. దుర్గుణములు గల కొడుకులు నూరుమంది యున్నను ఉపయోగము లేదు. రాత్రి వేళ చంద్రుఁ డొకఁడె ప్రకాశించుచున్నను, అతఁడు లోకమున కంతయు నేత్రమగును. కాని చుక్కలు పెక్కులున్నందు వలన అంత ఫలముండదు గదా !

సం॥ ఏకోఽపి గుణవాన్ పుత్రో నిర్గుణైః కిం శతైరపి,
ఏకశ్చంద్రో జగచ్చక్షుః నక్షత్రైః కిం ప్రయోజనమ్.

ఆ. వె. తీయవస్తు వొకఁడె తినఁదగ దెపుడైన,
జనము దారి [1]నొంటిఁ [2]జనఁగ రాదు.
[3]ఒండ్లు నిదుర వోవ నొకఁడు మేల్కొన రాదు
[4]అర్థచింతన మొకఁ [5]డరయ రాదు. 20

19-1. నేత్రమగును 2. రాత్రి 3. ప్రకాశింప, 20-1. ఒంటరిగ 2. వెళ్ల 3. ఇతరులు 4 విషయాలోచన 5. పరిశీలింపరాదు.

తా॥ తియ్యని వస్తువు నెన్నడును ఒక్కఁడే తినరాదు. జనము ఒంటరిగ ప్రయాణము చేయరాదు. జనులందరు నిద్రించు నపుడు తానొక్కఁడే మేల్కొని యుండరాదు. ప్రత్యేకమగు విషయములను ఒక్కఁడే పరిశీలించి నిర్ణయింపరాదు.

సం॥ ఏకః స్వాదు న భుంజీత నైకః సుప్తేషు జాగృయాత్,
ఏకో న గచ్ఛే దధ్వానం నైకశ్చార్థాన్ ప్రచింతయేత్.

ఆ. వె. [1]సుమతి [2]హీనుఁ గొలిచి [3]శోభ నందగ లేఁడు
సుజను నాశ్రయించి [4]శుభము లందు
త్రాగుఁబోతుఁ గూడి త్రాగఁబాలు, జనులు
[5]మద్యసేవ యనక మానఁగలరె ? 21

తా॥ మంచి బుద్ధి గల వాఁడు నీచులగు జనులను సేవించుటచే ప్రకాశింపలేడు. మహనీయులగు సజ్జనులను ఆశ్రయించుటచే శుభములను పొందును. త్రాగుఁబోతులతోఁజేరి పాలనే త్రాగుచున్నను "వాఁడు మద్యము (కల్లు) నే త్రాగుచున్నాడు" అనుటను జనులు మానరుగదా ?

సం॥ హీనసేవా న కర్తవ్యా కర్తవ్యో మహదాశ్రయః,
పయోఽపి శౌండినీ హస్తే వారుణీత్యభిధియతే.

ఆ. వె. బహుసమర్థున కిల [1]భార మగున దేది ?
[2]దీప్తబుధునకుఁ బరదేశ మేది ?
దూరదేశ మేది [3]దొడ్డ [4]ఉద్యోగికి ?
[5]పగతుఁ డెవ్వఁడు ప్రియవాది [6]కరయ ? 22

21-1. బుద్ధిమంతుడు 2. నీచుని సేవించి 3. ప్రకాశింపలేడు 4. మేళ్ళు 5. కల్లుత్రాగుట 22-1. బరువు (అసాధ్యము) 2. ప్రకాశించు విద్వాంసునకు 3. మంచి 4. ప్రయత్నించువానికి 5. శత్రువు 6. విచారింప.

తా॥ మిక్కిలి సమర్థులైన వారికేదియు బరువైనది (సాధింపరానిది) గ నుండదు. అటులనే ప్రసిద్ధులగు విద్వాంసులకు పరదేశమనునదే ఉండదు. ప్రయత్నించు స్వభావము గలవారికి దూరదేశమును ఉండదు. పరులను నొప్పింపకుండ ప్రియముగ మాట్లాడువారికి లోకమందు శత్రువే ఉండదు.

సం॥ కో హి భారః సమర్థానాం, కిం దూరం వ్యవసాయినామ్,
కో విదేశః సువిద్యానాం కః పరః ప్రియవాదినామ్.

ఆ. వె. [1]హర్మ్యములకు నంత మా కలహంబు లా
చెలిమి కంత మరయు [2]చేటు మాట
రాజ్య మంత మౌను రాజు [3]కంటకుఁడైన
పురుషకీర్తి [4]కంతు [5]పరుషవృత్తి 23

తా॥ కలహములే మేడల అవసాన (చివరి) దశకు మూల మౌను. చేటు దెచ్చు మాటలే మైత్రి చెడుటకు మూలము. రాజు ప్రజలకు కంటకుఁడు అగుటయే రాజ్యమంత మగుటకు మూలము. పరుషభాషణమే కీర్తి కంత మగును.

సం॥ కలహాన్తాని హర్మ్యాణి కువాక్యాంతం చ సౌహృదమ్,
కురాజాన్తాని రాష్ట్రాణి కుకర్మాంతం యశో నృణామ్.

ఆ. వె. మత్స్య-కూర్మములును, మహి వరాహ-నృసింహ
వామనాది రామ-రామ-కృష్ణ
బుద్ధ-కల్కి నామములతో [1]నవతరించి
హరి దశావతారపరత నొప్పె 24

23-1. మేడలకు 2. కీడు కల్గించు మాట 3. బాధకుడు 4. అంతము 5. కఠిన ప్రవర్తనము. 24-1. అవతారముల బొంది 2. పది అవతారము లందలి ఆసక్తితో.

తా॥ మత్స్యము, కూర్మము, వరాహము, నృసింహుడు, వామనుడు పరశురాముఁడు, శ్రీరాముఁడు, శ్రీకృష్ణుడు, బుద్ధుడు, కల్కి అను పేరులతో దశవిధములుగా అవతరించి ఆ శ్రీహరి మెప్పుమందెను.

సం॥ వనజౌ వనజౌ ఖర్వో రామౌ కృష్ణః కృపోఽకృపః
అవతారా దశైతే స్యుః కృష్ణస్తు భగవాన్ స్వయమ్.

తే గీ. పూల్లలో [1]చంప, వరనగరాల లంక,
నరపతిసుతుల రాముండు, నదుల గంగ
[2]లలనలందు రంభ, పురుషులందు [3]చక్రి,
కావ్యముల మాఘ మౌ కవి కాళిదాసు. 25

తా॥ పువ్వులలో సంపెంగపూవు, గొప్ప నగరములో లంకా నగరము, రాజపుత్రులలో రాముఁడు, నదులలో గంగానది, స్త్రీ జనులలో రంభ, పురుషులలో పురుషోత్తముఁడు (విష్ణువు), కావ్యములలో మాఘ కావ్యము, కవులలో కాళిదాసు మహాప్రసిద్ధులు.

సం॥ పుష్పేషు చంపా నగరీషు లంకా, నదీషు గంగా చ నృపేషు రామః
యోషిత్సు రంభా, పురుషేషు విష్ణుః, కావ్యేషు మాఘః కవికాళిదాసః.

తే. గీ. దేవి! నీ [1]కంఘ్రిసేవను [2]దీర్చి యెఱుఁగ
జనని ! నీ కెన్నడు నధిక ధనము [3]నీయ
అయిన నన్ను [4]గాతు [5]వాత్సల్య మమరంగ
[6]కుసుతుఁ డుండుగాక [7]కుమాత [8]క్షోణిఁగలదె ? 26

---

25-1. సంపెంగపూవు 2. స్త్రీలయందు 3. విష్ణువు 26-1. పాదసేవను 2 నెరవేర్చి 3. ఈయకుంటిని 4. రక్షింతువు 5. పెద్దలకు చిన్నవారియందు ఉండు నిర్మల ప్రేమ 6. దుష్టపుత్రుడు 7. దుష్టమాత 8. భువిపై

తా॥ ఓ దేవి ! నేను నీ పాదసేవ నెన్నడును చేసి యెరుఁగను. జగజ్జనని ! నేను నీకేనాడును అధికముగా ధనమునైనను సమర్పింప నయితిని. అయినప్పటికిని నన్నెంతో వాత్సల్యముతో పెంచినావు. లోక మందు కుసుతుఁడు (కుత్సితపుత్రుడు) ఉండిన నుండుగాక. కుమాత మాత్ర ము ఉండదు.

సం॥ జగన్మాత ర్మాత స్తవ చరణసేవా న రచితా
న వా దత్తం దేవి ! ద్రవిణమపి భూయ స్తవ మయా,
తథాఽపి త్వం స్నేహం మయి నిరుపమం యత్ప్రకురుషే
కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి

ఆ. వె. నరక మేది ? జీవసంబొ [1]పరవశంబు
సౌఖ్యమేది ? [2]సకలసంగ ముక్తి
సత్య మేది ? సర్వ జగదాది శక్తి యౌ
వసుధఁ [3]బ్రియ మ దేది ? ప్రాణ మౌను. 27

తా॥ 1) నరులకు చిరకాల మందు నరకమేది ? పరులకు లోబడి బ్రతుకొటయే 2) సౌఖ్యమనసేది? సాంసారిక బంధనములన్నింటియందు ఉండు ఆసక్తిని విడుచుటయే 3) సత్యమైనదేది ? విశ్వమునకు ఆధార మైన శక్తియే. 4)ఈ భువిలో జీవులకు మిక్కిలి ఇష్టమైన దేది? ప్రాణమే.

సం॥ కో నరకః? పరవశతా. కిం సౌఖ్యమ్? సర్వసంగవిరతిర్యా,
కిం సత్యమ్ ? భూతహితమ్. కిం ప్రేయః ప్రాణినా ? మసవః.

ఆ. వె. గుణము [1]లెల్ల యెడలఁ గొనుచుండు పూజలన్.
సంపదల క వెట్లు సాధ్యపడును ?

---

27-1. పరాధీనమైనది 2. సమస్తమైన సంసార సంబంధములను విడుచుట 3. మిక్కిలి ఇష్టమైనది. 28-1. అన్నిచోట్ల

విదియ [2] నిష్కళంక విధుఁ డందు వందనాల్
పొందఁ డవి [3]కళంక-పూర్ణవిధుఁడు. 28

తా॥ మంచి గుణము లన్ని చోట్ల పూజల నందుకొనును. సంపదలను బట్టి జనుల కా పూజలు సాధ్యపడవు. మచ్చలేని విదియ నాటి చంద్రుఁడు మాననీయుఁడగు నట్లు మచ్చ గల పూర్ణిమనాటి చంద్రుడు జనులకు వందనీయుఁడగునా ? కాఁడని భావము.

సం॥ గుణాః సర్వత్ర పూజ్యన్తే, న మహత్యోఽపి సంపదః.
పూర్ణేందుః కిం తథా వంద్యో నిష్కళంకో యథా కృశః.

ఆ. వె. గురువు లెందరో మహి గొప్పవా రుందురు.
శిష్యధనము [1]దోఁచు [2]శీలయుతులు
శిష్యమనముఁ [3]దిగుచు శ్రేష్ఠ గురుఁ డొకండు
పుడమిఁ జూడ [4]దుర్లభుండె యగును. 29

తా॥ గురువులలో గొప్ప వారెందరో ఉందురు. కాని అందు పెక్కురు శిష్యుల ధనమును హరించు స్వభావము గలవారే. శిష్యుల మనస్సులను ఆకర్షించునట్టి శ్రేష్ఠగురువు మాత్రము ధరణిలో నెంత వెదకినను దుర్లభుఁడే.

సం॥ గురవో బహవః సన్తి శిష్యవిత్తాపహారకాః,
దుర్లభః స గురుర్లోకే శిష్యచిత్తాపహారకః.

తే. గీ. సాటి లేదు తల్లి [1]కిల పోషణము నందు
సాటి లేదు విద్య [2]కల భూషణము నందు

---

28-2. మచ్చలేని చంద్రుడు 3. మచ్చతోనున్న పూర్ణచంద్రుఁడు 29-1. హరించు2. స్వభావము గలవారు. 3. ఆకర్షించు 4. పొందశక్యము కాని వాఁడు. 30-1. భువిపై 2. అ

సాటి లేదు భార్య 3కతితోషణము నందు
సాటి లేదు చింత 4కతిశోషణము నందు. 30

తా॥ ఈ భువిలో పిల్లల శరీరపోషణము నందు తల్లి కెవ్వరును సాటి గారు. నరుల నలంకరించుటలో విద్యకు సాటి వేరొకటి లేదు. మిక్కిలి సంతోషపెట్టుటయందు భార్య కెవరును సాటి గారు. శరీరమును ఎక్కువగా శుష్కింపజేయుటలో దిగులునకు సాటి లేనే లేదు.

సం॥ మాత్రా సమం నాస్తి శరీరపోషణం, విద్యాసమం నాస్తి శరీరభూషణమ్,
భార్యాసమం నాస్తి శరీరతోషణం, చింతాసమం నాస్తి శరీరశోషణమ్.

తే. గీ. పూజ్యగుణముల నున్నతిఁ బొందు నరుఁడు
ఆసనోన్నతి నౌన్నత్య మంద లేఁడు
మేడ కొన పైన కాకి తా నాడుచున్న
గరుడ భావంబు దానికిఁ గలుగఁ గలదె? 31

తా॥ లోకములో మానవుఁడు పూజనీయములగు మంచి గుణములచే ఉన్నత దశను పొందును. అంతియే గాని ఎత్తైన ఆసనముపై కూర్చుండు వానికి గొప్పతనము కలుగ జాలదు. కాకి మేడ కొనపైకి ఎక్కి ఉన్నంత మాత్రాన దానికి గరుడుని వంటి ఉన్నతి కలుగదుగదా.

సం॥ గుణై రుత్తుంగతాం యాతి నోచ్చైరాసన సంస్థితః,
ప్రాసాద శిఖరస్థోఽపి కాకః కిం గరుడాయతే?

---

30-3. మిక్కిలిగ సంతోషపెట్టుటలో 4. మిక్కిలిగ ఎండ గట్టుటలో
31-1. గొప్పతనము 2. గొప్పతనము

ఆ. వె. మాన్యగురుల కరయ [1]మత్సరం బది మెండు
[2]గర్వదూషితు లయి కనరు ప్రభులు
అన్యజనులు జ్ఞానశూన్యు లౌదురు, గాన
హృదిని [3]జీర్ణ మాయె [4]హృద్యసూక్తి. 32

తా॥ పూజ్యులగు గురువులలో కూడ అనేకులు పరస్పరము అసూయతో నుందురు. రాజులు రాజ్యగర్వముచే దేనిని కూడ లెక్కచేయరు. ఇతర జనులు తెలివి లేని వారు. కావున మనోహరమగు మంచి మాట కూడ మనస్సులోనే జీర్ణమైనది (పట్టు సడలి శక్తిహీనమైనది).

సం॥ బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః,
అబోధోపహతాశ్చాన్యే జీర్ణ మంగే సుభాషితమ్.

ఆ. వె. చచ్చి శత్రువులను [1]సాధింప శక్యమే ?
[2]రణనిహతుఁడు నెట్లు రాజ్య మేలు ?
జనుఁడు మరణ [3]మొంది సౌఖ్య మందుట యెట్లు?
బ్రదికి యున్న [4]శుభముఁ [5]బడయు వచ్చు. 33

తా॥ లోకమం దెప్పుఁడును తాను చచ్చి, పిదప శత్రువులను జయింప లేడు యుద్ధమందు మరణించిన రాజు రాజ్యము నెట్లు ఏలగలఁడు ? నరుఁడు మరణించిన పిమ్మట ఎట్లు సుఖపడఁ గలడు ? కావుననే తాను బ్రదికి యున్నపుడే ఏవైన శుభములను పొందగలడు. చచ్చిన పిదప పొందలేడు.

---

32-1. ఈర్ష్య (ఓర్వలేని తనము) 2. గర్వముచే దూషింప బడినవారు 3. పట్టు సడలి శిథిలమైనది 4. మనస్సును ఆకట్టు మంచి మాట. 33-1. జయింప 2. యుద్ధమున చంపబడినవాడు 3. పొంది 4. మేలు 5. పొంద

సం॥ న మృతో జయతే శత్రూన్ జీవన్ భద్రాణి పశ్యతి,
మృతస్య భద్రాణి కుతః కౌరవాయ కుతో జయః.

ఆ. వె. కనఁగ [1]దుర్లభంబు జనులకు నమృతంబు
[2]అమర దుర్లభంబు విమలజలము
ప్రజకు దుర్లభుండు [3]పరఁగు సాధుసుతుఁడు
[4]శక్రదుర్లభంబు [5]తక్ర మరయ 34

తా॥ భూమి మీఁది జనులకు అమృతము దుర్లభము. దేవతలకైనను నిర్మలమగు నీరు దుర్లభము జనులకు సద్గుణవంతుఁడగు కొడుకు దుర్లభుఁడు. దేవేంద్రునకు మజ్జిగయు దుర్లభమే.

సం॥ అమృతం దుర్లభం నృణాం దేవానా ముదకం తథా.
పితౄణాం దుర్లభః పుత్రః తక్రం శక్రస్య దుర్లభమ్.

ఆ. వె. [1]అధమ జనుల కరసి [2]యధికోపకృతిఁ జేయ
కలుగు ప్రతిఫల మపకార మౌను,
పాలు వోయ [3]ఫణికి ఫలిత మౌను విషమె.
జనుల [4]తత్త్వ మెఱిఁగి [5]సాగు సఖుఁడ! 35

తా॥ నీచ జనులకు మిక్కిలి ఉపకారము చేసినచో దానికి కలుగు ప్రతిఫలము అపకారమే యగును. పామునకు మనము పాలు పోసినను

---

34-1. పొందశక్యము కానిది 2. దేవతలకును పొంద శక్యముకాదు 3. ఒప్పుచున్న 4. ఇంద్రునకును పొంద శక్యముకానిది 5. మజ్జిగ

35-1. నీచులకు 2. మిక్కిలి ఉపకారమును 4. పామునకు 4. స్వభావము 5. ప్రవర్తించు

ఆ పాలు త్రాగి పాము మనపై విషమునే క్రక్కును. కావున మిత్రమా ! ఆయా జనుల స్వభావము తెలిసి మెలఁగుము.

సం॥ ఉపకారో౽పి నీచానా మపకారో హి జాయతే,
పయ:పానం భుజంగానాం కేవలం విషవర్ధనమ్.

తే. గీ. [1]లాలనము చేత దోషముల్ [2]లభ్యపడును
[3]తాడనముచేత [4]గుణలబ్ధి [5]తథ్య మండ్రు
కాన తనయుఁడైనను శిష్యుఁడైనఁ గాని
లాలనను వీడి దండింప [6]లాభ ముండు. 36

తా॥ చిన్నతనమునందు బిడ్డలపై గారాబమును చూపుటచే దోషములే పెరుగును. (అద నెరిఁగి తగినట్లు) శిక్షించుటచే మంచి గుణములు కలుగుట సత్య మందురు. కాన తనయుని గాని, శిష్యుని గాని ఎక్కువగా లాలింపక సమయోచితముగా దండించుటచే మంచి ప్రయోజన ముండును.

సం॥ లాలనాద్బహవో దోషా: తాడనాద్బహవో గుణా:,
తస్మాత్ పుత్రం చ శిష్యంచ తాడయేన్న తు లాలయేత్.

ఆ. వె. పేద నమ్మ తిట్టు, పిత [1]కూర్చఁ, [2]డనఁ డన్న,
పత్ని [3]పొత్తు వీడు, [4]భటుఁడు[5] కినియు,
[6]కలఁగు సుతుఁడు, సఖుఁడు తొలఁగి చనును; కాన
ధనము గూర్చు మంత ధనవశంబె. 37

36-1. గారాబముచే 2. కలుగును 3. తగురీతి దండించుటచే 4. గుణములు కల్గుట. 37-1. ప్రేమ చూపఁడు 2. పలుకఁడు 3. స్నేహము లేక చేరిక 4. సేవకుడు 5. కోపగించును. 6. కలఁత చెందును.

తా॥ ధనము లేక పేద యై యుండు బిడ్డను చూచి అమ్మ తిట్టును. తండ్రి ప్రేమను చూపడు. సోదరుఁడయ్యు అన్న పలుకడు. భార్య కౌఁగిలి విడుచును. సేవకుఁడును కోపగించును. తన కుమారుఁడే తండ్రిని అను సరించుటకు ఇష్టపడడు. మిత్రుఁడు-ధనము అడుగునేమో యను శంకతో-తప్పుకొని పోవును. కావున ధనము బాగుగా సంపాదింపుము. లోకమున అంతయు ధనమునకే లోబడి యుండునని గుర్తింపుము.

సం॥ మాతా నిందతి, నాభినందతి పితా, భ్రాతా న సంభాషతే,
భృత్యః కుప్యతి, నానుగచ్ఛతి సుతః, కాంతా చ నాలింగతే,
అర్థప్రార్థనయా న కురుతేఽప్యాలాప మాత్రం సుహృత్
తస్మాద్ద్రవ్య ముపార్జయాశు సుమతే ! ద్రవ్యేణ సర్వే వశా

ఆ. వె. [1]శంబరారి [2]కరయు [3]జలధార ప్రియ మౌను
[4]హరికి నాభరణ [5]చయంబు ప్రియము
[6]భాస్కరునకు ఆ నమస్కారములె [7]కూర్చు
[8]భూసురులకు ప్రియము భోజనంబు 38

తా॥ శంకరునకు అభిషేకమే ప్రీతికరము. విష్ణువునకు అలంకారములే ప్రీతిదాయకములు. సూర్యునకు నమస్కారములే ప్రీతిని గూర్చును. బ్రాహ్మణులకు భోజనమే ప్రియమైనది.

సం॥ అలంకారప్రియో విష్ణుః జలధారాప్రియః శివః,
నమస్కార ప్రియో భానుర్బ్రాహ్మణో భోజనప్రియః.

ఆ. వె. క్షాంతిసమము తపము జగతిఁ గాంచఁ గలమె ?
[2]సంతసంబు కంటె [3]సౌఖ్య మేది ?

38-1. శివునకు 2. విచారింప 3. అభిషేకము 4. విష్ణువునకు 5. సమూహము 6. సూర్యునకు 7. ఇష్టమగును 8. బ్రాహ్మణులకు

[4]తృష్ణతుల్య మైన [5]తెగు లరయఁ గలదె ?
దయకు సాటి శ్రేష్ఠ ధర్మ మేది ? 39

తా॥ ఈ ధరణిలో ఓర్పుతో సమాన మైన తపస్సును గాంచలేము సంతోషమును మించు సుఖమే లేదు. దప్పికతో సమమగు వ్యాధి యే లేదు దయకు దీటు (సరి) అగు గొప్ప ధర్మమును లేదు.

సం॥ క్షాంతితుల్యం తపో నాస్తి సంతోషాన్న సుఖం పరమ్,
నాస్తి తృష్ణసమో వ్యాధిర్న చ ధర్మో దయాపరః.

ఆ. వె. విద్య [1]కుద్ది యయ్యు [2]వెలయు బంధు వెవఁడు ?
[3]వ్యాధి తుల్య శత్రు [4]వవని లేఁడు.
పుత్రసముఁ డనఁ దగు మిత్రునిం గనలేము
దయను మించు [5]వొండు ధర్మ [6] మరుదు. 40

తా॥ విద్యకు సాటియైన బంధు వీ భువిలో దొరకఁడు. వ్యాధితో సరితూఁగు శత్రువే లేదు. అట్లే పుత్రునితో సమానుఁ డనఁ దగిన మిత్రుఁ డుండడు. దయకంటె గొప్పధర్మము వేరొకటి లేనే లేదు.

సం॥ న చ విద్యాసమో బంధుః న చ వ్యాధిసమో రిపుః,
న చాపత్యసమః స్నేహీ న చ ధర్మో దయాపరః.

ఆ. వె. అన్న దాన [1]మతుల [2]మంబుదానము నట్లె,
ద్వాదశీ సమతిథి [3]పరఁగ దెందుఁ,

---

39-1. ఓర్పుతో సమానమైన 2. సంతోషముకంటె 3. సుఖము 4. దప్పికతో సాటియైన 5. వ్యాధి. 40-1. సమానము 2. ప్రకాశించు 3. జబ్బుతో సమానమగు శత్రువు 4. భువిలో 5. వేరొక 6. అపూర్వము (పూర్వము కలుగనిది) లేక దుర్లభము.

ఆ. వె. కార్యహాని చేయు [1]కడఁక [2]మాటుఁగునుండి
[3]ఇచ్చకంబు లాడు నెదుట నెపుడు
కాంచి యహ [4]పయోముఖవిషకుంభ మయిన
వాని విడిచి నరుఁడు పడయు సుఖము. 41

తా॥ చాటునుండి పూనుకొని కార్యభంగముచేయుచు, ఎదుట మాత్రము ఇచ్చకములాడు చుండును. అట్టి పయోముఖ విషకుంభమువంటి మిత్రుని విడిచిపెట్టినచో నరుఁడు సుఖమును పొందును

సం॥ పరోక్షే కార్యహంతారం ప్రత్యక్షే ప్రియవాదినమ్,
వర్జయేత్ తాదృశం మిత్రం విషకుంభం పయోముఖమ్.

ఆ. వె. [1]కూర్పఁ జాల దరయ [2]గుహ్యాంగ గుప్తిని
పరఁగ, గనము [3]దంశవారణంబు.
అగుట కుక్కతోక వ్యర్థమౌ, నటులనే
చదువుకొనని నరుని బ్రదుకు [4]వృథయె. 42

తా॥ కుక్కతోక కప్పియుంచదగు గుహ్యాంగమును కప్పిపుచ్చ లేదు. అది ఈగలనైనను నివారింపజాలదు. అట్లగుటచే ఆ తోక వ్యర్థమే. అవిధముగనే చదుకొననివాని బ్రతుకుకూడ నిష్ఫలమే.

సం॥ శునః పుచ్ఛ మివ వ్యర్థం జీవితం విద్యయా వినా,
న గోప్యగోపనే దక్షం న చ దంశనివారణే.

---

41-1. ప్రయత్నముతో 2. చాటున నుండి 3. ప్రియమగు మాటలు
4. పైనపాలుండి లోపల అంతయు విషముగల కడవ 42-1. కల్గింపజాలదు
2. రహస్యాంగమును కప్పిపుచ్చుట 3. ఈగలను నివారించుట 4. నిష్ఫలము

ఆ. వె. చదువుట [1]కవకాశ [2]మొదవకుండు నెచట
ధనము [3]గూర్చ దారి [4]తనర దెచట
[5]ఆత్మసుఖము నందు [6]అధ్వ మెచట లేదొ
ఒక్క దినము నచట నుండఁ దగదు. 43

తా॥ ఎచ్చట చదువుకొనుటకును, ధనసంపాదనమునకును ఆత్మానందము పొందుటకును అవకాశమే లేదో అచట నొక్కదినమైనను నిలువరాదు.

సం॥ యత్ర విద్యాగమో నాస్తి, యత్ర నాస్తి ధనాగమః,
యత్ర వాత్మసుఖం నాస్తి న తత్ర దివసం వసేత్.

ఆ. వె. తండ్రి రక్షకుండు [1]తనయకు బాల్యాన
భర్త రక్షకుండు [2]పరువమందు
సుతుఁడు రక్షకుండు చూడ [3]వార్ధకమున
వనిత కరయు [4]స్వీయ పథము గలదె ? 44

తా॥ స్త్రీకి బాల్యదశలో తండ్రియే రక్షకుఁడు యౌవనదశలో భర్త రక్షకుఁడు. ముసలితనమందు పుత్రుఁడే రక్షకుఁడు. కాఁగా స్త్రీకి స్వతంత్రముగ వ్యవహరింపవలసిన దశ లేదు అని భావము.

[అయితే ఇక్కడ మూలమందు స్త్రీ స్వాతంత్ర్యమునకు అర్హురాలు కాదను అర్థము వచ్చునట్లు పదక్రమమున్నది. అది కాలానుగుణమగు భావమునకు విరుద్ధముగ దోచుట సత్యము. ఇట ఈ యంశము గమనింపవలయును ]

సం॥ పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,
పుత్రో రక్షతి వార్ధక్యే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి

43-1. వీలు 2. కలుగకుండుట 3. సంపాదించు 4. పొసఁగదు 5 తన సుఖము, పరమానందము 6. దారి. 44-1. కుమార్తెకు 2 యౌవనదశయందు 3. ముసలితనమునందు 4. సొంత (ప్రవర్తన) కుదెరువు

తే. గీ. తాను [1]సర్వేశుఁ [2]డద్రీశుఁ డౌను మామ
[3]అనుఁగు [4]విత్తేశుఁడు, [5]గణేశుఁ డౌను సుతుఁడు
అయినఁ దప్ప లేదు గద భిక్షాటనంబు
విధి [6]బలీయ మౌ నెంతటి [7]విభున కైన. 45

తా॥ శివుఁడు స్వయముగా అందరికంటె అన్నిటికంటె ఐశ్వర్యవంతుఁడు. శివుని మామ కొండలరాజు. అతని మిత్రుఁడు ధనపతియగు కుబేరుఁడు. కొడుకు గణేశుఁడు. అట్టి ఐశ్వర్యము, బంధు - మిత్ర - సుత సంపద కలవాఁడైనను శివునకు బిచ్చమెత్తుట తప్పలేదు. కావున ఎంతటి గొప్పవానికంటెను విధియే బలవత్తరము అని తెలియుచున్నది.

సం॥ స్వయం మహేశః శ్వశురో నగేశః సఖా ధనేశ స్తనయో గణేశః,
తథాऽపి భిక్షాటన మేవ శంభో ర్బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా.

ఆ. వె. చిలుకవలెనె నరులు పలుక నేర్వవలయు
[1]అజమువలెనె అన్న [2]మానవలయు
అల బకంబువలెనె [3]ధ్యానింపవలయును
[4]హస్తివలెనె స్నాన మాడవలయు. 46

తా॥ జనులు చిలుకలవలె ముచ్చటగ పల్కుట నేర్చుకొనవలెను. మేకవలె అన్ని శాకము (ఆకు) లను తినవలెను. కొంగవలె నిశ్చలముగ [5]ఏకాగ్రతతో పరమాత్మ చింతనము చేయుచుండవలెను. ఏనుఁగువలె లోతు నీటిలో స్నానము చేయవలెను.

సం॥ శుకవద్భాషణం కుర్యాద్బకవద్ధ్యాన మాచరేత్,
అజవచ్చర్వణం కుర్యాద్గజవత్ స్నానమాచరేత్.

---

45-1. అందరికంటె ఐశ్వర్యవంతుడు 2. కొండలఱేఁడు 3. మిత్రుఁడు 4. ధనపతి (కుబేరుడు) 5. వినాయకుడు 6. మిక్కిలి బలముగలది 7. ప్రభువునకైన 46-1. మేక 2. ఆస్వాదించవలయును 3 పలుమార్లు పరమాత్మనుచింతింప 4. ఏనుఁగు 5. లక్ష్యమందే మనసు నిలిపి.

ఆ. వె. బలము లేని ప్రజకు బలము భూపతి యౌను
మూఢజనుల బలము [1]మూగతనమె
చోరజనుల బలము చూడ నబద్ధమే
[2]చెలఁగు రోదనంబె శిశుబలంబు. 47

తా॥ దుర్బల జనులకు బలము రాజె. మూఢుల బలము మాటాడ కుండుటయే. దొంగలకు బలము అబద్ధ మాడుటయే. శిశువులకు పెద్దగ నేడ్చుటయే బలము.

సం॥ దుర్బలస్య బలం రాజా బాలానాం రోదనం బలమ్.
బలం మూర్ఖస్య మౌనత్వం చోరాణా మనృతం బలమ్.

ఆ. వె. దర్శనంబుచేతఁ [1]దరుణ చిత్తము [2] దోఁచు
[3]స్పర్శనంబుచేత బలము లాగు
[4]సంగమంబుచేత సారంబు హరియించు
అట్టి నారి [5]దనుజ యనఁగఁ దగును. 48

తా। సజ్జన మార్గమును విడిచిన వనిత దర్శనముచే యువకుని మనస్సును, స్పర్శనముచే మనోబలమును, సంగమముచే సారమును హరించును. అట్టి నారి రాక్షసి యనదగి యుండును.

సం॥ దర్శనాద్ధరతే చిత్తం స్పర్శనాద్ధరతే బలమ్.
సంభోగాద్ధరతే వీర్యం నారీ ప్రత్యక్షరాక్షసి.

---

**47-1. మాట్లాడకుండుట 2. అతిశయించు 48—1. యువకుని మనస్సును 2. హరించును 3. తాకుటచేత 4. కలయికచేత 5. రాక్షసి**

ఆ. వె. ధనము తృణమె యౌను ధర [1]నుదారులకును
[2]పరమవీరుల కిల బ్రదుకె తృణము.
[3]అక్షవిజయి కరయ [4]నబలయే తృణమౌను.
[5]విగతకాంక్షి కగును జగమె తృణము. 49

తా॥ భువిలో మహాత్ములకు ధనము తృణప్రాయము (గడ్డిపోచతో సమానమని భావము) శూరులకు మరణమే తృణము. విరక్తిగలవారికి భార్యయు తృణమే. కోరికలు లేనివారికి ఈ వసుధయే తృణము.

సం॥ ఉదారస్య తృణం విత్తం, శూరస్య మరణం తృణమ్,
విరక్తస్య తృణం భార్యా నిస్పృహస్య తృణం జగత్.

ఆ. వె. బుద్ధి కలుగు నరుఁడు పొందు [1]నైజబలము,
[2]ప్రజ్ఞ లేనివాఁడు ప్రబలుఁ డగునె?
[3]చెవుల పిల్లి చేత [4]సింగ మంతం బాయె
అరసి చూడు మోయి! ఆంధ్ర సఖుఁడ! 50

తా॥ ఓ ఆంధ్ర మిత్రమా! బుద్ధిబలముగల మానవుఁడే సహజబలమును ప్రకటింపగలఁడు. బుద్ధిబలము లేనివాఁడు బలవంతుఁడు కాలేఁడు. బుద్ధిబలముగల కుందేలు బుద్ధిబలముచాలని మృగరాజునే సంహరించినది గదా.

సం॥ బుద్ధిర్యస్య బలం తస్య నిర్బుద్ధేస్తు కుతో బలమ్,
పశ్య సింహో మదోన్మత్తః శశకేన నిపాతితః.

---

49-1. దాతలకు (ఉదారస్వభావులకు) 2. గొప్ప వీరులకు 3. ఇంద్రియములను జయించినవానికి 4. వనితయే 5. కోరికలు లేనివానికి.

50-1. సహజబలము 2. బుద్ధి 3. కుందేలు 4. సింహము

ఆ. వె. అవని నధమునుజ [1]లవ్యోన్య మర్మములొ
పరు లెఱుంగఁ దామె పల్కుచుంద్రు
కనఁ బరస్పరమును [2]క్షయముఁ గాంతురు, దాన
పుట్టలోన నుండు [3]భుజగ మట్లు. 51

తా॥ భువిలో నధములు కొందరు ఒండొరుల రహస్యములను ఇతరులకు తామె తెలియజెప్పుచుందురు. కాని దానిచే నారు పుట్టలోనున్న పాముపలె పరస్పరము నాశ మందుట తప్పదు.

సం॥ పరస్పరాణి మర్మాణి యే వదన్తి నరాధమాః,
పరస్పరం క్షయం యాన్తి వల్మీకోదరసర్పవత్.

ఆ. వె. వసుధ నే నరుండు భక్తిఁ [1]బత్రం బిచ్చు
నెవఁడు పుష్ప మిచ్చు నెవఁడు ఫలము
నెవఁడు నాకు [2]తోయ మిచ్చు నిర్మలమతి
[3]నతుల తృప్తి దాని నారగింతు. 52

తా॥ భువిలో నాకు (గోవిందునకు) ఎవడు నిర్మలమగు మనస్సు కలిగి భక్తితో పత్రము (తులసి దళము)ను ఇచ్చునో, ఎవఁడు పుష్పము నిచ్చునో, ఎవడు పండు నిచ్చునో, ఎవఁడు జలము నిచ్చునో ఆయా వస్తువులను నేను అధికతృప్తితో స్వీకరించెదను.

సం॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.

---

51-1. ఒండు ఒరుల రహస్యములను 2. నాశము 3పాము,
52-1. ఆకు (ఇట తులసి యాకు అనుట యుక్తము) 2. నీరు 3. సాటి లేని తృప్తి (తనివి)తో.

ఆ. వె. ధరణిపాలకసతి, గురుని భార్యయు, నెన్న
మిత్రసతియు, [1]పరకళత్ర మాత
తనదు మాత యనఁగఁ దల్లు లైదుగు రౌట
తెలిసి మెలఁగ వలయు తెలుఁగు బిడ్డ! 53

తా॥ రాజుభార్య, గురునిభార్య, మిత్రునిభార్య, తనభార్యతల్లి యనగా అత్త తన తల్లి అని తల్లు లైదుగురు గలరని తెలుఁగు బిడ్డా! తెలిసి ప్రవర్తింపవలెను.

సం॥ రాజపత్నీ గురోః పత్నీ మిత్రపత్నీ తథైవ చ,
పత్నీమాతా స్వస్య మాతా పంచైతా మాతరః స్మృతాః.

ఆ. వె. [1]జననకారకుండు, తనరెడు [2]నుపనేత
చదువు నేర్పునట్టి [3]సద్గురుండు
పరఁగు నన్నదాత, భయముఁ [4]బాపు నతఁడు
పంచ పిత లనంగ [5]వఱలు చుంద్రు 54

తా॥ జన్మ నిచ్చువాఁడు, వడుగుచేయువాఁడు, చదువు చెప్పునట్టి గురువు, అన్నదాత, భయమును పోఁగొట్టి కాపాడువాఁడు అను ఈ యైదు గురు పంచపితలు (తండ్రులు) అనగ ప్రకాశింతురు

సం॥ జనితా చోపనేతా చ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి,
అన్నదాతా భయత్రాతా పంచైతే పితరః స్మృతాః.

---

53-1. ప్రియమగు భార్య తల్లి.

54-1. జన్మకు కారణమైనవాఁడు 2. ఉపనయనము చేసినవాఁడు 3. మంచి గురువు 4. పోఁగొట్టు 5. ప్రకాశించు.

ఆ. వె. రాముసతి హరించు రావణున కయిన
జూద మాడు [1]ధర్మ సుతున కైన
మాయలేడిఁ బట్టు [2]మహిత రామునకైన
[3]చేటు కాలమందు చిత్త [4]మెడలు. 55

తా॥ శ్రీరాముని భార్యయగు సీత నపహరించు రావణునకైనను. జూదమాడెడు ఆ ధర్మరాజునకైనను, మాయలేడిని పట్టుకొన బూనిన రామచంద్రునకైనను చేటుకాలము దాపురించినపుడు మనస్సు వికలమై పట్టు దప్పును ఆ దశలో వివేకమును కోల్పోవుదురని భావము.

సం॥ పౌలస్త్యః కథ మన్యదారహరణే దోషం న విజ్ఞాతవాన్
అక్షైశ్చాపి యుధిష్ఠిరేణ రమతా జ్ఞాతో న దోషో ను కిమ్,
రామేణాపి వనే న హేమహరిణస్యాసంభవో లక్షితః
ప్రత్యాసన్న విపత్తి మూఢమనసాం ప్రాయో మతిః క్షీయతే.

ఆ. వె. పరుల భోజనంబు దొరకనో దుర్బుద్ధి!
[1]కడఁక [2]నసువులందుఁ గరుణ విడుము.
అట్టి భుక్తి ధరణి [3]నతిదుర్లభం బౌను
జనుల కసువు లమరు జన్మ జన్మ 56

తా॥ పరుల యింట మృష్ట భోజనము దొరకునప్పుడే ఆరుదు. అట్టి భోజనమే దొరకి ఎక్కువగా తినినచో ప్రాణములు పోవునేమో యని దుఃఖింపవలదు అట్టి మృష్టాన్నము లోకములో దుర్లభము. ప్రాణము లంటవా అవి జన్మజన్మకు లభించును. కాన ప్రాణము పోవునేమోయను జంకు విడిచి భుజింపుము.

55-1. ధర్మరాజునకు 2. మహిమగల 3 వినాశకాలమందు 4 వికలమగును
56-1. పూనికతో 2. ప్రాణములందు 3. మిక్కిలిగ పొందశక్యముకానిది.

సం॥ పరాన్నం ప్రాప్య దుర్బుద్ధే! మా ప్రాణేషు దయాం కురు,
పరాన్నం దుర్లభం లోకే ప్రాణా జన్మని జన్మని.

ఆ. వె. [1]ఓదనంబు చివర [2]నుదకంబు విష మౌను
[3]అశనమందు [4]వారి యమృత మగును
అఱుగకున్న దశను నౌషధం బగు నీరు
[5]భుక్తి యఱుగ జలము శక్తి నిచ్చు. 57

తా॥ భోజనము చివర త్రాగునీరు విషముతో సమానము. అన్నము తినునపుడు త్రాగు జలము అమృతముతో సమానము. అన్నము అరుగనపుడు త్రాగిన నీరు మందుగా పనిచేయును. తినినది అరిగిన పిమ్మట త్రాగు నీరు బలము నిచ్చును.

సం॥ భోజనాన్తే విషం వారి భోజనే చామృతం పరమ్,
అజీర్ణే భేషజం వారి జీర్ణే వారి బలప్రదమ్.

ఆ. వె. [1]క్షీరసేవనంబు శ్రేష్ఠంబు [2]నిశలందు
విమలవారిసేవ [3]వేగు తఱిని
భోజనాంతమందుఁ బూర్ణ [4]తక్రం బున్న
నరుఁడు మందుఁ గైకొనంగనేల ? 58

తా॥ దినాంతమందు అనగా రాత్రివేళ పాలను, వేకువన మంచినీటిని, భోజనము చివర మజ్జిగను త్రాగుచుండు జనులకు మందు సేవించు నవసరము తగ్గును.

సం॥ దినాన్తే పిబేద్దుగ్ధం, నిశాన్తే చ పిబేత్పయః,
భోజనాన్తే పిబేత్తక్రం, కిం వైద్యస్య ప్రయోజనమ్.

---

57-1. అన్నము 2. నీరు 3. భోజనమందు 4. నీరు 5. భోజనము.
58-1. పాలుత్రాగుట 2 రాత్రులందు 3. వేకువజామున 4. మజ్జిగ.

ఆ. వె. [1]మర్కటంబు మొదట, [2]మద్యంబు సేవించె
పిదప దానిఁ గుట్టె [3]వృశ్చికంబు
నహ్ని నడుగు పెట్టె, పైన [4]భూతావేశ
మే మనియెదు కోఁతి [5]యెడరుఁ గాంచి. 59

తా॥ మొదట నది కోఁతి. అనగా నిలకడలేని స్వభావము గలది. దానికితోడు కల్లు త్రాగినది. పిమ్మట దానిని తేలు కుట్టినది. ఆపైన నిప్పులు త్రొక్కినది. ఆ మీఁద భూతము ఆవేశించినది. దాని బాధజూచి నే నేమన గలను?

సం॥ మర్కటస్య సురాపానం తతో వృశ్చికదంశనమ్,
తన్మధ్యే భూతసంచారః యద్వా తద్వా భవిష్యతి.

ఆ. వె. మనసు, వాక్కు, కర్మ [1]మాలిన్య రహితమై
[2]మాన్యజనులు పుడమి [3]మసలుచుండ
తలఁపు, మాట, చేఁత మలినుఁడై [4]ఖలుఁడుండు
తెలిసి మెలఁగు మోయి తెలుఁగుబిడ్డ. 60

తా॥ భువిలో పూజ్యులగు జనులు మనో-వాక్కర్మలయందు అనగా త్రికరణములయందు దోషములు లేక నడచుకొనుచుందురు. కాఁగా దుష్టులు ఆ త్రికరణములందు దోషము కలిగియుందురు. కావున ఓ తెలుఁగు బిడ్డా! నీవు జాగరూకుఁడవు (తెలివి గలవాడవు) ఐ మెలఁగ వలయును.

---

59-1. కోఁతి 2. కల్లు 3. తేలు 4. భూతము (పిశాచము) ప్రవేశించుట 5. ఆపద. 60-1. దోషములేనిదై 2. పూజ్యులు 3. విహరించుచుండగా 4. దుష్టుఁడు.

సం॥ మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్,
మనస్యన్య ద్వచస్యన్య త్కార్యే చాన్య ద్దురాత్మనామ్.

ఆ. వె. [1]తరుణ వయసున [2]సతి మరణించు కంటెను
గొప్ప పాపమేమి చెప్ప నుండు ?
మనసునందు నొకటి మనుజుఁ డెంచుచు నుండ
దైవ మొండు దలఁచు దయను వీడి. 61

తా॥ యౌవన వయసునందు భార్యమరణించుటకంటె గొప్ప పాప ముండదు. మనుజుఁడు తన మనస్సుతో నొకటి తలంచుచుండ, దైవము వేరొకటి దలంచుచుండును.

సం॥ తారుణ్యే చ మృతా భార్యా పాతకం కి మతః పరమ్,
మనసా చింతితం కార్యం దైవ మన్యత్ర చింతయేత్.

ఆ. వె. [1]అధమనరుఁడు గోరు [2]నర్థంబె మనసార
మధ్యముండు గోరు [3]మాన—ధనము
లుత్తముండు గోరు నుచితమాన మొకటె
మాన మొకటె ధరణి [4]మహితధనము. 62

తా॥ లోకమందు అధముఁడు మనసార ధనమునే కోరును. మధ్యముఁడు మానధనములను గోరును. ఉత్తముఁడు తగు మానమునే కోరును. ఈ భువిలో మాన మొక్కటే మహితాత్ముల ధనము.

సం॥ అధమా ధన మిచ్ఛన్తి ధనమానౌ చ మధ్యమాః,
ఉత్తమా మాన మిచ్ఛన్తి మానో హి మహతాం ధనమ్.

---

61-1. యౌవనమందు 2. భార్య
62-1. నీచుఁడు 2. ధనమే 3. గౌరవములేక అత్మాభిమానమును, ధనమును 4. మహాత్ములకు — ధనము.

ఆ. వె. సత్య మెచట నుండు [1]సద్ధర్మ మట నుండు
ధర్మ మనుసరించి ధనము నుండు
ఎచట రూప ముండు నచట శీలము నుండు
[2]బలముఁ బట్టి యుద్ధఫలము నుండు. 63

తా॥ ఎచట సత్య ముండునో అచట మంచి ధర్మముండును ఎచట ధర్మ ముండునో అచటనే ధనముకూడ నుండును. మంచి రూపము ననుసరించి మంచి శీలము ఉండును. సైన్యబలమునుబట్టి యుద్ధఫల ముండును.

సం॥ యత: సత్యం తతో ధర్మో యతో ధర్మ స్తతో ధనమ్,
యతో రూపం తతః శీలం యతో నాగా స్తతో జయ:.

ఆ. వె. పాండుసుతుల ప్రక్క [1]పద్మాక్షుఁ డుండంగ
జయము వారి కౌట సత్య మగును.
ఎచట కృష్ణుఁ డుండు నచట ధర్మము నుండు
ఎచట ధర్మ ముండు నచట జయము. 64

తా॥ పాండవుల పక్షమందు కృష్ణుడుండగా వారికి జయము కల్గుట సత్యమే. ఎచట కృష్ణుడుండునో అచట ధర్మముండును. ఎచట ధర్మ ముండునో అచటనే జయము ఉండును.

సం॥ జయోఽస్తు పాండుపుత్రాణాం యేషాం పక్షే జనార్దనః,
యత: కృష్ణ స్తతో ధర్మో యతో ధర్మ స్తతో జయః

---

63-1. వాస్తవ ధర్మము 2. సైనికబలము.
64-1 విష్ణువు లేక కృష్ణుఁడు.

ఆ. వె. [1]పసిండి గద్దె నుంచి [2]పట్టంబు గట్టినన్
[3]పాయు లేదు కుక్క [4]పాదరక్ష
పాలు వోసి పెంచ పాముఁవిషమె పెరుఁగు
సహజబుద్ధి విడువ శక్య మగునె 65

తా॥ బంగరు గద్దెపై కూర్చుండ జేసి పట్టము గట్టినను కుక్క చెప్పును పీకుట మాన జాలదు. పామునకు పాలు పోసి పెంచినను దానికి విషమే పెరుగును. కనుకనే సహజబుద్ధి మార్చుకొనుటకు శక్యము గాదు.

సం॥ యః స్వభావో హి యస్యాస్య తస్యాసౌ దురతిక్రమః,
శ్వా యది క్రియతే రాజా స కిం నాశ్నాత్యుపానహమ్.

ఆ. వె. [1]జలదచయు [2]మరుగు విశాఖకార్తె చనఁగ
[3]పరువ మేగు [4]సంతు పెరుగుచుండ
సుజనుకోప [5]సెడలు శుభద వందనమున
[6]అఱుగు గౌరవంబు [7]యాచనమున 66

తా॥ విశాఖకార్తె కడచిపోవుటతో మేఘము లన్నియు చెదలిపోవును కావున వానల కాలము ఐపోయినట్లే అని భావము. సంతానము పెరుగుచున్న కొలఁది యౌవనము తగ్గుచుండును. మేలును గూర్చెడు నమస్కారముతో సజ్జనుని కోపము కొలగును. యాచనముచే గౌరవము తగ్గును.

సం॥ విశాఖాన్తం గతా మేఘాః ప్రసవాన్తం హి యౌవనమ్,
ప్రణామాన్తః సతాం కోపో యాచనాన్తం హి గౌరవమ్

---

65-1. బంగారు సింహాసనము 2. పట్టాభిషేక సమయమున నుదుట గట్టెడు బిళ్ళ 3. విడువలేను. 4. చెప్పును. 66-1. మేఘముల గుంపు 2. పోవు 3. యౌవనము 4. సంతానము 5.చెదరిపోవును 6.తగ్గును 7. అర్థించుటచే

ఆ. వె. [1]రంకు నైనఁజేయు రాజుగా [2]వఱలంగ
రాజు నైనఁ జేయు రంకు గాను
పేద-ధనికుల నిల పెంపున మార్చు నా
[3] దైవలీల మార్పఁ [4]దరము గాదు 67

దైవము దరిద్రుని కూడ రాజుగా జేయును. రాజునైనను దిక్కు లేని దీనునిగా చేయును అట్లే పేదను ధనికునిగాను, ధనికుని పేదగాను చేయును. అట్టి దైవచేష్ట మార్ప శక్యము గాదు.

సం॥ రంకం కరోతి రాజానం, రాజానం రంక మేవ చ,
ధనినం నిర్ధనంచైవ, నిర్ధనం ధనినం తథా.

ఆ. వె. [1]జనకృతాఘఫలము జనపతి పొందును
ఆ పురోహితుండు [2]నధిపకృతము
భార్య దుష్టశీల ఫలముఁ బతియె పొందు
శిష్యపాప ఫలము చేరు గురుని 68

తా॥ జను లొనర్చు పాపముల ఫలమును రా జనుభవించును. రాజు చేసిన పాపఫలమును పురోహితుఁడు పొందును. భార్య యొక్క చెడ్డ నడవడిచే కలుగు పాపమును భర్త పొందును. శిష్యులు చేయు పాపము గురువును చేరును.

సం॥ రాజా రాష్ట్రకృతం పాపం, రాజ్ఞః పాపం పురోహితః,
భర్తా చ స్త్రీకృతం పాపం శిష్యపాపం గురు స్తథా.

---

67-1. దీనుఁడు లేక దరిద్రుఁడు 2. ప్రకాశించునట్లు 3. దైవముయొక్క చేష్ట (క్రియ) 4. శక్యము 68-1. జనులచే చేయబడు పాపము యొక్క ఫలము 2. రాజుచే చేయబడు పాపము.

ఆ, వె. "పురుషయోగ్యతకును మూలమౌ వస్త్రంబె"
అనుట వాస్తవంబ [1]దరసి చూడ
ప్రియసుత నిడె [2]జలధి [3]పీతాంబరముఁగాంచి
[4]దిగ్వసనము గాంచి తీవ్రవిషము. 69

తా॥ వస్త్రమే "పురుషయోగ్యతకు మూలము" అను మాట పరిశీలింపగా వాస్తవమనిపించును సముద్రుఁడు తన కూతురగు లక్ష్మిని పీతాంబరము చూచి విష్ణునకిచ్చెను. ఆ జలధియే దిగంబరము జూచి శివునకు మహావిషము నిచ్చెను.

సం॥ కిం వాసస్యైవం న విచారణీయం, వాసః ప్రధానంఖలు యోగ్యతాయాః,
పీతాంబరం వీక్ష్య దదౌ తనూజాం దిగంబరం వీక్ష్య విషం సముద్రః.

ఆ. వె. విద్యచేత [1]వెలయు విద్వాంసుఁ డెఱుఁగును
విద్య నేర్చు వాని [2]వెతల నెల్ల
ఓర్వఁ [3]దరము గాని [4]యువిద ప్రసవబాధ
[5]వంధ్య వనిత కనదు, వాస్తవంబు. 70

తా॥ విద్యచే ప్రకాశించు విద్వాంసుఁడు మాత్రమే విద్య నేర్చుట యందుండు బాధల నెరుఁగ గల్గును. సహింప శక్యముగాని స్త్రీ ప్రసవ బాధను వంధ్యయైన వనిత యెరుఁగ జాలదు.

సం॥ విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్,
న హి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్.

---

69-1. పరిశీలించి 2. సముద్రము 3. బంగరుపచ్చని వస్త్రమును 4. దిక్కులే వస్త్రముగా నుండుటను. 70-1. ప్రకాశించు 2. బాధలను 3. శక్యము 4. స్త్రీల కాన్పుబాధ 5 గొడ్రాలు.

ఆ. వె. [1]క్షోణిలోని నీరు [2]శుచి యౌను పరికింప
భార్య [3]శుద్ధ భర్తృభక్తిచేత
నరుల కుశల మరయు నరపతి శుద్ధుండు
సంతసంబున శుచి [4]సద్ద్విజుండు. 71

తా॥ భూమిలోపల నుండు నీరు నిర్మలముగా నుండును. భార్య పతిభక్తిచే పవిత్రురాలగును. ప్రజల క్షేమమును కాపాడురాజు పరిశుద్ధుఁడగును. బ్రాహ్మణుఁడు సంతోషముచే శుద్ధుడగును.

సం॥ శుచి భూమిగతం తోయం శుచిర్నారీ పతివ్రతా,
శుచిః క్షేమకరో రాజా సంతోషీ బ్రాహ్మణో శుచిః

ఆ. వె. పరుల కెపుడు శుభమె పలుకుచుండవలయు
తనరు శుభము నెపుడు దలఁపవలయు
శాశ్వతంపు శుభమె [1]సతము కోరవలయు
[2]కాయ మరొ [3]పరోపకార ఫలము. 72

తా॥ ఇతరులకు శుభకరముగనే ఎల్లప్పుడు మాట్లాడవలెను. మనస్సులో నెల్లప్పుడు నిజమగు శుభమునే తలంచుచుండవలెను. జనులకు శాశ్వతమగు శుభమునే గోరవలెను. శరీరమునకు ఫలము పరోపకారమే.

సం॥ శుభం బ్రూయాత్ శుభం ధ్యాయేత్ శుభ మిచ్ఛేచ్చ శాశ్వతమ్,
జన్తూనా ముపకారాయ కుర్యాద్దేహాది చాలనమ్

---

71-1. భూమిలోనుండు 2. నిర్మలమైనది 3 పరిశుద్ధురాలు 4. సజ్జనుడగు బ్రాహ్మణుడు. 72-1. ఎల్లప్పుడు 2. శరీరము 3. ఇతరులకు ఉపకారము చేయుటయే ఫలముగాగలది.

ఆ. వె. [1]అలరు మామ యింట [2]నహము లై దాఁ బున్న
[3]నాకతుల్య మౌను నరుల కెల్ల
[4]అన్న లోభవశత అధికకాలమె యున్న
మానహీనుఁ డౌను మానవుండు. 73

తా॥ సంతసము గూర్చి మామగారింట ఐదారు దినము లున్నచో అనుజా యిల్లు స్వర్గముతో సమానముగ నుండును. కాని భోజనాదుల కాశపడి ఎక్కువకాల మచటనే యున్నచో మనుజుని గౌరవము తగ్గును.

సం॥ శ్వశురగృహనివాస: స్వర్గతుల్యో నరాణాం
యది భవతి వివేకీ పంచ వా షడ్దినాని,
దధి-మధు-ఘృతలోభా న్మాసమేకం వసేచ్చే
ద్భవతి విగతలజ్జో మానవో మానహీన:.

ఆ. వె. జగతి దేనినుండి [1]మృగమదము లభించు?
[2]హస్తిశతము నేది [3]హతము సేయు?
[4]కాతరుండును [5]పొలికలనఁ జేయున దేమి?
[6]మృగమునుండి [7]హరియె మిగులఁ బఱచు. 74

తా॥ దేనినుండి కస్తూరి లభించును? నూరేనుఁగుల నేది చంపును? యుద్ధభూమిలో పిఱికివాడేమి చేయును? ఈ మూఁడు ప్రశ్నలకు వరుసగ (1) మృగమునుండి (2) సింహము (3) మిగులదూరముగా పారిపోవును అనునవి సమాధానములు. (ఇది చిత్ర పద్యము)

సం॥ కస్తూరీ జాయతే కస్మాత్? కో హన్తి కరిణాం శతమ్?
కిం కుర్యాత్ కాతరో యుద్ధే? మృగాత్సింహ: పలాయతే.

---

73-1. (సుఖ సంతోషములతో) ఒప్పు 2. దినములు 3. స్వర్గసమానము 4. భోజనాదులందలి ఆసక్తిచే. 74-1. కస్తూరి 2. నూరేనుగులను 3. చంపు 4. పిఱికివాడు 5. యుద్ధభూమిలో 6. లేడి 7. సింహము.

ఆ. వె. మంత్రి దోష మరయ మాన్యభూపతి కంటు
పత్ని దోష మెన్న భర్త కంటు
శిష్యదోష మంటు [1]చెనఁటి గురువుల, కౌట
నెఱిఁగి మెలఁగవలయు నెల్లజనులు. 75

తా॥ మంత్రిచేసిన దోషముల ఫలము రాజునకు చేరును. భార్య యొక్క దోషముల ఫలము భర్త కంటును.శిష్యలొనర్చు దోషములఫలము చెడ్డగురువులకు చేరును కావున జను లెల్లరు తమ తమ విధులను, బాధ్యతలను తెలిసికొని మెలగవలెను. రాజు మంత్రి తప్పుచేయకుండ చూడవలెను .అట్లే భార్య తప్పు చేయకుండ భర్తయు, శిష్యులు తప్పులు చేయకుండ గురువులను జాగ్రత్తగ గమనించి సరిదిద్దవలెనని భావము.

సం॥ రాజ్ఞ శ్చామాత్యజా దోషా: పత్నీదోషాస్తు భర్తరి,
తథా శిష్యార్జితం పాపం గురుః ప్రాప్నోతి నిశ్చితమ్,

ఆ. వె. [1]మృగము మృగముతోడ, వృషభంబు [6]వృషముతో
[2]హయము హయముతోడ నందు చెలిమి,
మూర్ఖు మూర్ఖుతోడ, [3]బుధుఁడు బుధునితోడ,
శీల-జాతి [4]సమతఁ [5]జెలఁగు మైత్రి. 76

తా॥ లేడి లేడితోను, గోవు గోవుతోను, గుఱ్ఱము గుఱ్ఱముతోను, మూర్ఖుఁడు మూర్ఖునితోను, పండితుఁడు పండితునితోను మైత్రి చేయును. లోకములో చెలిమి శీలసామ్యమును, జాతిసామ్యమునుబట్టి పెంపొందును.

సం॥ మృగా మృగైస్సంగ మనువ్రజన్తి గావశ్చ గోభిస్తురగాస్తురంగైః,
మూర్ఖాశ్చ మూర్ఖైః సుధియాః సుధీభిః సమానశీల-వ్యసనేషు సఖ్యమ్.

---

75-1. కుత్సితుఁడైన (నికృష్టుఁడైన) 76-1. లేడి 2. గుఱ్ఱము 3. పండితుఁడు 4. సమానత్వము (సామ్యము) 5. అతిశయించు 6. ఎద్దు

ఆ. వె. దేశవిప్లవములఁ [1]దీర్థస్థలములందు
యాత్రలందు పెండ్లి [2]యుదనులందు
జగడ మందు గ్రామ నగర [3]దాహములందు
అంటు దోష మెప్పు డరయ రాదు. 77

తా॥ దేశమం దేదైన విప్లవము వచ్చినపుడుగాని, తీర్థక్షేత్రము లందుగాని, దేశయాత్రలందుగాని, పెండ్లిండ్లు జరుగునపుడుగాని, యుద్ధము జరుగునపుడుగాని, గ్రామమో, నగరమో తగులఁబడునపుడుగాని అంటు దోషమును గణింపరాదు

సం॥ తీర్థే వివాహే యాత్రాయాం సంగ్రామే దేశవిప్లవే,
నగర-గ్రామ దాహే చ స్పృష్టాస్పృష్టిర్న దుష్యతి.

ఆ. వె. [1]వార్ధకంబునందు భార్య పోవుటయును
అర్థమెల్ల బంధుహస్తగతము
అరయ భోజనంబు పరుల యింట నగుట
జన [2]విడంబనంబె జగతి మూఁడు. 78

తా॥ ముసలితనమునందు భార్య మరణించుట, ధనమంతయు బంధువులచేతులందు చిక్కుట, పరుల యిండ్లలో భుజింపవలసివచ్చుట అను నీ మూఁడును తిరస్కారములే అనఁదగును. ఇట్టి స్థితులు అయా జనులకు వెక్కిరింతలే అని భావము.

సం॥ వృద్ధకాలే మృతా భార్యా బంధుహస్తగతం ధనమ్,
భోజనం చ పరాధీనం త్రయం పుంసాం విడంబనమ్.

---

77-1. పుణ్యక్షేత్రము, పుణ్యనదులందు 2. సమయము 3. కాలుటలందు.
78-1. ముసలితనమునందు 2. తిరస్కారమే లేక వెక్కిరింతయే.

ఆ. వె. [1]అమృతకరుఁడు రాత్రి [2]నలరింపఁ జేయును
పగటి వెలుగు నిచ్చు [3]భాస్కరుండు
[4]వెలయఁ జేయు ధర్మ మల మూఁడు లోకాల
కులము నలరఁజేయు [5]గుణి సుతుండు. 79

తా॥ చంద్రుడు రాత్రిని ప్రకాశింపఁ జేయును సూర్యుఁడు పగటి వేళ వెలుగు నిచ్చును. ధర్మము మూఁడు లోకములను వెలయఁజేయును. గుణవంతుఁడగు కొడుకు కులమునే ప్రకాశింపఁ జేయును.

సం॥ శర్వరీదీపక శ్చంద్రః ప్రభాతే దీపకో రవిః.
త్రైలోక్యదీపకో ధర్మః సుపుత్రః కులదీపకః.

ఆ. వె. [1]ఫణికి నుండు విషము పరఁగ కోరలయందు
[2]మక్షికమున కుండు [3]మస్తకమున
[4]వృశ్చికమున కుండు విషము [5]పుచ్ఛమునందు
[6]ఖలులకుండు విషము కాయమంత. 80

తా॥ పామునకు కోరలయందు విషముండును. కందురీగ మున్నగు వానికి విషము తలయందుండును. తేలునకు విషము తోక (కొండి) యందు ఉండును. దుర్జనునకు దేహమందంతట విషముండును. అనగా దుష్టుఁడు విషసర్పముకంటెను, మక్షికాదులకంటెను, తేలుకంటెను, జనుల కెక్కువ బాధను కల్గించును. కావున జనులిది గ్రహించి దుష్టులకు దూరముగా నడచుకొనవలెనని భావము.

సం॥ తక్షకస్య విషం దన్తే మక్షికాయాశ్చ మస్తకే,
వృశ్చికస్య విషం పుచ్ఛే సర్వాంగే దుర్జనస్య తత్.

---

79-1. చంద్రుఁడు 2. ప్రకాశింప 3. సూర్యుఁడు 4. ప్రకాశింప 5. గుణవంతుఁడైన 80-1. పామునకు 2. (కందురు) ఈఁగ 3. తలయందు 4. తేలునకు 5. తోకయందు 6 దుష్టులకు.

ఆ. వె. అర్చ్యుఁడౌను మూర్ఖుఁ డాత్మగృహమునందె
ప్రభువు నర్చ్యుఁ డతని గ్రామ మందె
అర్చ్యుఁడౌను రాజు నాత్మదేశమునందె
అర్చ్యుఁడౌను [2]ప్రాజ్ఞుఁ డవని నంత. 81

తా॥ మూర్ఖుఁడు తన యింటియందును, ప్రభువు తన గ్రామమందును, రాజు స్వదేశమందు మాత్రమే పూజింపబడుచునుండ విద్వాంసుఁడు భువి యందు అంతట పూజ్యుఁడు అగుచున్నాఁడు

సం॥ స్వగృహే పూజ్యతే మూర్ఖః స్వగ్రామే పూజ్యతే ప్రభుః,
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే.

ఆ. వె. శిరమె ముఖ్యమౌను [1]జీవుల దేహాన
[2]ఎసఁగు కన్నె ముఖ్య మింద్రియముల
ఉప్పె ముఖ్య మయ్యె నొప్పు షడ్రుచులందు
నీరె ముఖ్య మగును [3]నిఖిల నదుల. 82

తా॥ ప్రాణి శరీరమందు శిరస్సే ముఖ్యాంగము. ఐదు జ్ఞానేంద్రియ ముల (కన్ను, ముక్కు, చెవి, జిహ్వ, చర్మముల) లో నయనమే ముఖ్య మగు జ్ఞానేంద్రియము. ఉప్పు, తీపి, కారము, పులుపు, ఒగరు, చేదు అను నారు రుచులలో ఉప్పే ముఖ్యమగు రుచి. నదులన్నింటిలో నీరే ముఖ్యము.

సం॥ సర్వస్య గాత్రస్య శిరఃప్రధానం, సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్,
షణ్ణాం రసానాం లవణం ప్రధానం భవేన్నదీనా ముదకం ప్రధానమ్.

---

81-1. పూజ్యుఁడు 2. విద్వాంసుఁడు 82-1. ప్రాణులయొక్క 2. అతిశ యించు 3. సకల.

ఆ. వె. పాప మడఁచు గంగ తాప మణఁచు [1]రాజు
[2]దైన్య మడఁచు [3]కల్పతరువు నటులె
పాప-తాప-దైన్య బాధలన్ బోఁగొట్టి
[4]సాధుసంగమంబె జనులఁ బ్రోచు. 83

తా॥ గంగానదీ తన పవిత్ర జలముతో జనుల పాపములను పోఁగొట్టును. చల్లని వెన్నెలచే చంద్రుఁడు జనుల తాపమును అణఁచును. అటులనే కల్పవృక్షము దీనుల దారిద్ర్యమును పోగొట్టును. సజ్జనులతో చేయు స్నేహము జనులయొక్క పాప-తాప-దైన్యముల వలన కలుగు బాధలను తొలఁగించి కాపాడును,

సం॥ గంగా పాపం శశీ తాపం దైన్యం కల్పతరు స్తథా,
పాపం తాపం చ దైన్యం చ హన్తి సాధుసమాగమః.

ఆ. వె. మాతృతుల్యమైన మహితదైవము లేదు
[1]జననిఁ బోలు బంధుజనుఁడె లేఁడు
తండ్రి సాటి గురుఁడు [2]తడవంగ లేఁడెందు
అవనిఁ బుట్టు ప్రాణి [3]కరసి చూడ. 84

తా॥ ఈ పుడమిపై బుట్టు జీవకోటికి తల్లితో సమానమగు దేవుఁడు గాని, తల్లికిసాటి యగు బంధువుగాని లేఁడు. అట్లే ఎంత వెదకినను తండ్రితో సమానమగు గురుఁడును లేఁడు.

సం॥ నాస్తి మాతృసమం దైవం నాస్తి పితృసమో గురుః,
నాస్తి మాతృసమో బంధుర్జంతూనా మస్తి భూతలే.

---

83-1. చంద్రుఁడు 2. దారిద్ర్యము 3. కల్పవృక్షము (కోర్కెల దీర్చు చెట్టు) 4. సజ్జన స్నేహము. 84—1. తల్లివంటి 2. వెదక 3. పరిశీలించవ లేక విచారింప.

ఆ. వె. [1]పరఁగు చదువె ధనము పరదేశములయందు
[2]వెలయు మతియె ధనము [3]విపదలందు
[4]అమలధర్మ మె ధన మన్యలోకమునందు
శీలమె ధన మయ్యు [5]చెలఁగు నంత. 85

తా॥ ఇతరదేశములకు వెళ్లినపుడు చదువె నరులకు ధనమగును. ఆపదలు వచ్చినపుడు సమయస్ఫూర్తితో నొప్పు బుద్ధియే ధనము. ఈ లోకమున తాను చేసినట్టి నిర్మలధర్మమే పరలోకమునకు చేరినపుడు ధనముగ ఉపయోగపడును ఇఁక మంచి నడవడి యనునది అన్నిచోట్ల ధనముగ తోడ్పడును.

సం॥ విదేశేషు ధనం విద్యా వ్యసనేషు ధనం మతిః,
పరలోకే ధనం ధర్మః శీలం సర్వత్ర వై ధనమ్.

ఆ. వె. దానతుల్యధనము కాన లే దన్యంబు
సత్యసమము [1]వ్రతము జగతి లేదు
శీలతుల్య [2]శుభము చెంద లే దన్యంబు
[3]క్షమకు సాటి [4]హితము కాన మెుండు. 86

తా॥ దానముతో సమానమగు ధనము వేరొకటి కన్పించదు. సత్యము (పలుకుబడి)తో సమమగు వ్రతము ఈ లోకములో లేదు. శీలముతో సాటియగు మేలు మరియొకటి లేదు. ఓర్పుతో తుల్యముగ శుభకరమైనది ఇంకొకటి లేదు.

సం॥ న దానతుల్యం ధన మన్యద స్తి, న సత్యతుల్యం వ్రతమన్యద స్తి,
న శీలతుల్యం శుభ మన్యద స్తి, న క్షాంతితుల్యం హితమన్యద స్తి.

---

85-1. ఒప్పు 2. సమయస్ఫూర్తితో ప్రకాశించు 3. ఆపదలందు 4. స్వచ్ఛమగు ధర్మము 5. అతిశయించును. 86-1. నియమము 2. మేలు 3. ఓర్పునకు 4. మేలును కల్గించునది.

ఆ. వె. అర్థ ముత్తమంబు స్వార్జితం బయ్యె నే
మధ్యమంబు పితృసమార్జితంబు
అధమ మనఁగఁ జెల్లు నల [1]భ్రాతృలబ్ధంబు
[2]అబల ధన మగు [3]నధమాధమంబు. 87

తా॥ తాను సంపాదించిన ధనముతో బ్రదుకుట ఉత్తమ మనియు, తండ్రి సంపాదించి పెట్టిన ధనముతో బ్రతుకుట మధ్యమ మనియు, సోదరుని నుండి లభించిన ధనముతో బ్రతుకుట అధమమనియు, స్త్రీ మూలమున లభించు ధనముతో బ్రదుకుట అధమాధమ మనియు గుర్తింపఁ దగును

సం॥ ఉత్తమం స్వార్జితం విత్తం మధ్యమం పితురార్జితమ్,
అధమం భ్రాతృవిత్తం చ స్త్రీవిత్త మధమాధమమ్.

ఆ. వె. తల్లికంటె పరమదైవంబు లే దెందు
తల్లిఁ బోలు గురుఁడు తనరఁ డెందు
మాతృసముఁడు పూజ్యమానవుం డుండఁడు
తల్లివంటి [1]హితుఁడు ధరణి లేఁడు. 88

తా॥ తల్లిని మించిన దైవముగాని, తల్లితో సమానమగు గురువుగాని, తల్లితో సమముగా పూజింపఁదగు మనుజుఁడుగాని, తల్లివలె సుతుల మేలు గోరువాఁడుగాని ఈ భువిలో లేఁడు.

సం॥ నాస్తి వేదాత్పరం శాస్త్రం, నాస్తి మాతృసమో గురుః,
నాస్తి మాతృసమః పూజ్యః, నాస్తి మాతృసమః సఖా.

---

87-1. సోదరునివలన లభించినది 2. స్త్రీ ధనము 3. అధమములగు వానిలోకూడ అధమమైనది. 88-1. Nil.

ఆ. వె. [1]అమలదాన మేది? అడుగ కిచ్చునదియె
వరసఖుఁ డెవఁ? [2]డఘనివారకుండు
[3]భూషణ మఁగు నేది? పొసఁగు శీలమె సుమ్ము
పలుకుల నగ యేది? [4]పరమఋతము. 89

తా॥ నిర్మలమగు దాన మేది? అడుగకుండ ఇచ్చునదియే. మేలొనర్చు మిత్రుఁడెవఁడు? పాపము కల్గించు పనులు చేయనీయక అడ్డగించువాఁడు. జనుల కలంకారమేది? ఒప్పు శీలమే. మాటల కలంకార మేది? గొప్పదగు సత్యమే.

సం॥ కిం దానం? మనాకాంక్షమ్. కిం మిత్రమ్? యో నివారయతి పాపాత్,
కోఽలంకారః? శీలమ్. కిం వాచాం మండనమ్? సత్యమ్.

ఆ. వె. [1]జిహ్వ ననుసరించి చెలఁగుచుండును లక్ష్మి
జిహ్వ ననుసరించి చేరు జనము
జిహ్వ ననుసరించి చెలఁగు [2]బంధ మరయు
జిహ్వ ననుసరించి చేరు మృతియు. 90

తా॥ మాటలను బట్టియే సంపద పెంపొందును. మాటలను బట్టియే జనులతో స్నేహము పెరుగును. మాటల వలననే 3చెఱబంధములును కల్గును. మాటలను బట్టియే మేలుగాని, కీడుగాని జరుగును.

సం॥ జిహ్వాగ్రే వర్తతే లక్ష్మీర్ జిహ్వాగ్రే మిత్రబాంధవాః,
జిహ్వాగ్రే బంధ సంప్రాప్తిః జిహ్వాగ్రే మరణం ధ్రువమ్.

---

89-1. నిర్మలమగు దానము 2. పాపకార్యముల నుండి వారించువాఁడు 3. నగ 4 గొప్పదగు సత్యము. 90-1. నాలుక (ఇట మాట అని గ్రహింపవలెను). 3 చెఱబడుట మొదలగు చిక్కులు.

ఆ. వె. కలుగు సుఖము ముందు,[1]మెలఁగు దుఃఖము మీఁద
మొదట దుఃఖ మెసఁగ, తుదను సుఖము
దుఃఖ-సుఖము లెపుడు దొరలు చక్రము నట్లు
పరఁగుచుండు జనుల బ్రదుకులందు. 91

తా॥ జనుల జీవితములలో సుఖముముందు కలిగెనేని పిదప దుఃఖము కల్గును. ముందే దుఃఖము కల్గిన తుదకు సుఖము కలుగును. ఇట్లు సుఖము దుఃఖము ఈ రెండును జనుల బ్రదుకులలో పొర్లుచున్న చక్రము క్రింది మీఁదు, మీఁదు క్రిందును అగునట్లు మారుచుండును.

సం॥ సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్,
చక్రవత్పరివర్తంతే దుఃఖాని చ సుఖాని చ.

ఆ. వె. [1]ఋణము, [2]యాచనంబు, వృద్ధత్వ - [3]దీనతల్
వ్యాధి, చోర-[4]జారభావములును
అన్య [5]భుక్తశేష మాహార మగుటయున్
అష్ట కష్టములని ఆర్యులంద్రు. 92

తా॥ అప్పుచేయుట, యాచించుట, ముసలితనము, దారిద్ర్యము, వ్యాధికల్గుట. దొంగతనము, జారుఁడు (వ్యభిచారి) అగుట, ఇతరులు తినగా మిగిలినది ఆహారమగుట అను నీ ఎనిమిది అష్టకష్టములని పెద్దలచే చెప్పబడినవి.

సం॥ ఋణం యాచ్ఞా చ వృద్ధత్వం జార-చోర-దరిద్రతా,
రోగశ్చ భుక్తశేషశ్చ హ్యష్టకష్టాః ప్రకీర్తితాః.

---

91-1. ప్రవర్తిల్లు.

92-1. అప్పు 2. యాచించు 3. దారిద్ర్యము 4. వ్యభిచారము 5. తినగా మిగిలినది.

ఆ. వె. దాసి, సేవకుండు. తనయుండు, బంధువున్
[1]వసు ధనములు, వస్తు [2]వాహనములు
ధాన్యవృద్ధి [3]వఱల ధర జనుల కివియె
అష్ట [4]భోగములయి యలరుచుండు. 93

తా॥ దాసియు, సేవకుఁడును, కుమారుఁడు, బంధుజనము, రత్నములు, ధనము,వివిధములగు వస్తువులు, తగు వాహనములు, ధాన్యసమృద్ధి కలిగనేని భూజనుల కివె అష్టభోగములు లేక అష్టైశ్వర్యములని చెప్పబడినవి.

సం॥ దాసీ, భృత్యః, సుతో, బంధుర్వస్తు-వాహనమేవ చ,
ధన-ధాన్య సమృద్ధిశ్చ హ్యష్టభోగాః ప్రకీర్తితాః.

ఆ. వె. కనఁగ [1]నంధుఁ డెవఁ? [2]డకార్యరతుఁడె సుమ్ము
[3]బధిరుఁ డెవఁడు? [4]హితము వదలు నతఁడె
అరయ [5]మూఁగ యెవ్వఁ? డవసరసమయాన
తగిన మాట పలుక [6]తలఁగు నతఁడె. 94

తా॥ అంధుఁ డనఁగా నెవఁడు? తగని పనులయెడ ఆసక్తి చూపువాఁడె. చెవిటివాఁడెవఁడు? ఆప్తుని హితవాక్యమును వినక వదలుకొనువాఁడె. మూఁగ యనఁగా నెవఁడు? అవసరమగు సమయాన చెప్పఁదగు మాటను చెప్పక తప్పుకొనిపోవువాఁడె.

సం॥ కోఽన్ధో? యోఽకార్యరతః, కో బధిరః? యో హితాని న శృణోతి.
కో మూకః? యః కాలే ప్రియాణి వక్తుం న జానాతి.

---

93-1. రత్నములు, ధనము 2. అశ్వము, గజము మొదలైనవి 3. కలుగగా 4. ఐశ్వర్యములు. 94-1. గ్రుడ్డివాఁడు 2. తగని పనియందాసక్తి కలవాఁడు 3. చెవిటివాఁడు 4. మేలును 5. మాటలు రానివాఁడు 6. తొలఁగిపోవు

ఆ. వె. వస్త్ర ముఖ్యమయ్యె వఱలు [1]నలంకృతి
[2]ప్రేమ ముఖ్యమౌను పెట్టు భుక్తి
గుణమె ముఖ్యమగును [3]కులకాంతలకు నెల్ల
విద్య ముఖ్యమయ్యె [4]వెలయు నరుఁడు. 99

తా॥ అలంకారము లన్నింటిలో ముఖ్యమైనది వస్త్రమే. భోజన విషయమున ప్రేమతో పెట్టుటయే ముఖ్యాంశము. సత్కులములో బుట్టిన స్త్రీలకు గుణమే ముఖ్యమైనది. విద్యయే ముఖ్యమైయుండు నరుఁడే ప్రకాశించును.

సం॥ వస్త్ర ముఖ్యస్త్వలంకార: ప్రీతిముఖ్యం తు భోజనమ్,
గుణో ముఖ్యస్తు నారీణాం విద్యా ముఖ్యం పూరుషాణామ్.

ఆ. వె. ధరణి దుఃఖకరము [1]పరవశవృత్తి యౌ
అదియె సుఖకరమగు [2]నాత్మవశము
చూడ నరుల కిదియె [3]సుఖదుఃఖజనక మౌ
ముఖ్యలక్షణ మయి [4]పొలుచుచుండు. 100

తా॥ లోకమందలి జనులకు పరాధీనమై బ్రతుకుటయే దు:ఖకరమగు విషయము. అదియే స్వాతంత్రమున బ్రదుకకల్గినచో సుఖమును కల్గించును. పరిశీలింప నరుల స్వతంత్ర జీవనము సుఖమునకు కారణమగును. అట్లే పరతంత్ర జీవనము దు:ఖమునకు కారణమగును.

సం॥ సర్వం పరవశం దు:ఖం సర్వ మాత్మవశం సుఖమ్.
పతద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః.

---

99-1. అలంకారము 2. ప్రీతియే ముఖ్యముగాగలది 3. మంచికులములో స్త్రీలకు బుట్టిన 4. ప్రకాశించును. 100-1. పరాధీనమైన బ్రదుకుదెరువు 2. స్వతంత్రమైన బ్రదుకుదెరువు 3. సుఖమునో దు:ఖమునో కల్గించు 4. ఒప్పు

# సూక్తిసుధాకరము
## ద్వితీయ భాగము

ఆ. వె. జగతి తరువు లెల్ల [1]ఛాయ నన్యుల కిచ్చి
యెండయందు తాము మాడుచుండు
పండ్లచెట్లు నటులె పండ్లఁ బరుల కిచ్చి
[2]యలరుచుండు సజ్జనాళి పగిది. 1

తా॥ లోకమందు చెట్లన్నియు పరప్రాణులకు నీడనిచ్చి సంతోష పెట్టుచు తాము మాత్రము ఎండయందే మాడుచుండును అట్లే ఫలవృక్షములను సజ్జనులవలె తమ ఫలముల నన్నింటిని పరుల కర్పించి ఒప్పుచుండును లేక ఆనందించుచుండును.

సం॥ ఛాయా మన్యస్య కుర్వన్తి తిష్ఠన్తి స్వయ మాతపే,
ఫలాన్యపి పరార్థాయ. వృక్షా సత్పురుషా ఇవ.

ఆ. వె. [1]మాన్యజనులమైత్రి మహి నెల్ల జనులకు
[2]ఉన్నతిఁ గలిగించి [3]యొప్పు మీఱు
తామరాకు మీఁదఁ దనరు నా [4]జలబిందు
వలరు [5]ముక్త మట్లు [6]నబ్బురముగ. 2

తా॥ భువిలో మహాత్ములతో మైత్రిగల జనులందరు ఉన్నతిని గాంచి యొప్పుచుందురు. జలబిందువు తామరాకుపై నుండి ముత్యమువలె ప్రకాశించుచు అబ్బురము గొల్పుచుండును.

---

**1-1.** నీడ **2.** ఒప్పు లేక ఆనందించు. **2-1.** పూజ్యులగు **2.** పెంపును **3.** ఒప్పిదముతో నతిశయించును **4.** నీటిబొట్టు **5.** ముత్యమువలె **6** పూర్వమెన్నడు కలుగనట్లు (అపూర్వము).

సం॥ మహాజనస్య సంసర్గః కస్య నోన్నతికారకః,
పద్మపత్రస్థితం వారి ధత్తే ముక్తాఫలశ్రియమ్.

ఆ. వె. పుష్పశోభితంబు, పూర్ణగంధయుతము
నైన సుతరు వొకటి [1]అమరి యున్న
అవ్వనం బ దంత [2]నలరు సుగంధాన
కులము [3]సుసుతుచేత వెలయు నట్లు

తా॥ పువ్వులతో నిండి ప్రకాశించుచు నిండు పరిమళముతో నొప్పు మంచి పూలచెట్టొకటి అమరియున్నచో సత్పుత్రునిచే ప్రకాశించు వంశము వలె ఆ వనమంతయును ఆ పూలచెట్టుచే పరిమళించును.

సం॥ ఏకేనాపి సువృక్షేణ పుష్పితేన సుగంధినా,
వాస్యతే తద్వనం సర్వం సుపుత్రేణ కులం యథా.

ఆ. వె. చదువురాని జనులు సభల [1]వెలయఁజాల
[2]రంచలందు కొంగ [3]లలర నట్లు
ఔట పితరు లెన్న [4]నాత్మజ శత్రువుల్
స్వీయ సుతులఁ [5]బుధులఁ జేయరేని.

తా॥ హంసలందు కొంగలు ప్రకాశింపలేనట్లు చదువులేనివారు రాజ సభలలో వెలుగఁ జాలరు. కావున తమ బిడ్డలను మంచి విద్యావంతులుగాఁ జేయని తల్లిదండ్రులు తనయుల శత్రువులే. అనగా అట్టి తల్లిదండ్రులు శత్రువులవలెనే బిడ్డల పురోభివృద్ధిని అడ్డుకొన్నవారే అగుదురని భావము.

సం॥ మాతా శత్రుః పితా శత్రుః యేన బాలో న పాఠితః,
న శోభతే సభామధ్యే హంసమధ్యే బకో యథా.

---

3-1. కలిగి 2. ఒప్పును 3. గుణవంతుఁడగు కొడుకుచే. 4-1. ప్రకాశింప 2. హంసలందు 5. శోభించనట్లు 4. కుమారుల 5. పండితులనుగా.

ఆ. వె. ఒక్క [1]పాలు నరయుఁ జక్క గురువు నుండి
[2]అన్యపాద మరయు నాత్మబుద్ధి
[3]అపర పాద మందు నన్యబాలురనుండి
కాల మరుగఁ బొందుఁ [4]గడమపాలు 5

తా॥ చదువరు లెల్ల తాము సంపాదించు జ్ఞానములో నాల్గవ పాలు గురువుల బోధవలనను, మరియొకపాలు తన 5 ప్రతిభచేత. ఇంకొకపాలు సహాధ్యాయుల (తోడి చదువరుల) నుండియు, మిగిలిన నాల్గవ భాగము కాలక్రమమున అనుభవమును బట్టియు సంపాదించును.

సం॥ ఆచార్యాత్పాద మాదత్తే పాదం శిష్యః స్వమేధయా,
పాదం సబ్రహ్మచారిభ్యః పాదం కాలక్రమేణ చ.

ఆ. వె. పుస్తకంబు నందె [1]పొసఁగు [2]చదువు నొండె
అన్య జనుల [3]కిడిన [4]యర్థ మొండె
అదను [5]కంద కుంట నా విద్య విద్య కా
దట్టి [6]యర్థ మర్థ మరయఁ గాదు. 6

తా॥ పుస్తకమందే యుండు విద్య- చదివి. మది కెక్కించుకొనని విద్య-గాని. పరుల కిచ్చిన ధనముగాని తనకు ఆ చదువుతోగాని, ధనముతో గాని అవసర మేర్పడినపుడు తనకు ఉపయోగపడవు అని లోకాను భవమును బట్టియే తెలియుచున్నది. కావున అట్టి చదువుగాని, ధనముగాని ఉన్నం?వలన అట్టి నరులకు కలుగు ప్రయోజనముండదు.

సం॥ పుస్తకస్థా చ యా విద్యా పరహస్తేచ యద్ధనమ్,
కార్యకాలే సమాయాతే, న సా విద్యా న తద్ధనమ్.

---

5-1. నాల్గవభాగము (1/4) 2. వేరొకపాలు 3. వేరొకపాలు 4. మిగులిన 6. ఎప్పటికప్పుడు వికసించుబుద్ధి. 6-1. చేరియుండు 2. విద్యగాని 3. ఇచ్చిన 4 ధనముగాని 5. చేతికి చిక్కకుండుటచే, (చదువు విషయములో) తోఁచకుండుటచే 6 ధనము.

ఆ. వె. సర్ప-దుష్టు లవని 1చలుపుచుందురు 2చేటు
3పలువకంటె నరయ 4చిలువ మేలు
పాము కఱచు నన్యుఁ బ్రత్యేక సమయాన
5అడు గడుగున కీడు పలువ చేయు. 7

తా॥ పాము - దుర్జనుడును అన్యజీవులకు ఆపదలను కల్గింతురు. కాని పరికింప దుష్టునికంటె పామె కొంత మేలు. ఎట్లన:- పాము ఇతర ప్రాణిని ప్రత్యేక సమయమున (తనకు రాపిడిగాని, ఆత్మరక్షణావసరము గాని కలిగిన కాలమందే) కాటు వేయును దుర్జనుఁడు మాత్రము తఱచుగా ఇతరులకు చెరుపుచేయుట ప్రత్యక్షానుభవమే.

సం॥ సర్పదుర్జనయోర్మధ్యే వరం సర్పో న దుర్జనః,
సర్పో దశతి కాలేన దుర్జన పదే పదే.

ఆ. వె. పరఁగు 1నుపకృతులనె పరుల కెపుడుఁ జేయ
2జాగరూకుఁడౌను సజ్జనుండు
పరఁగు 3నపకృతులనె పరులకు 4సతతంబు
5బట్టి చేయఁ జూచు పలువ నరుఁడు. 8

తా॥ లోకములో సజ్జనుఁడు పరుల కుపకారము చేయుటకే శ్రద్ధతో అదనున కెదురు చూచుచుండును. అట్లే దుర్జనుఁడు పరులకపకారము చేయుటకే నిత్యము 6 నిరీక్షించుచుండును.

సం॥ యథా పరోపకారేషు నిత్యం జాగర్తి సజ్జనః,
తథా పరాపకారేషు నిత్యం జాగర్తి దుర్జనః

7-1. చేయుచుందురు 2. కీడు 3. దుష్టుని 4. పాము 5. మాటిమాటికి అనగా తఱచుగా 8-1. ఉపకారములనే 2. మేల్కొన్నవాఁడు (చేయ శ్రద్ధ చూపువాఁడని ఇట భావము) 3. అపకారములనే 4. నిత్యము 5. పట్టుదలచూపి 6. ఎదురుచూచుచుండును.

ఆ. వె. దుష్టజనుల కెపుడు దూరమై యుండుము
సాధు జనుల చెలిమి [1]సతము నడుపు
పుణ్యకార్య మెపుడు [2]పూనికన్ జేయుమా
ప్రాణి [3]నశ్వర మని పరగఁ దెలిసి. 9

తా॥ దుష్టుల నెప్పుడు దూరముగా నుండుము. ఎల్లప్పుడు సజ్జనులతో చెలిమి చేయుము. ప్రాణులన్నియు నశించునవే గాని శాశ్వతములు కావని చక్కగ గుర్తించి ఎల్లవేళల పుణ్యము కలిగించు కార్యములనే పూని చేయుచుండుము.

సం॥ త్యజ దుర్జన సంసర్గం భజ సాధుసమాగమమ్,
కురు పుణ్య మహోరాత్రం స్మర నిత్య మనిత్యతామ్.

ఆ. వె. చంద్రసూర్యు లరయ [1]జలదవృక్షంబులున్
నదులు, గోవు లెన్న [2]మృదుల హృదులు
పరుల [3]కుపకరింపఁ బరమదైవంబుచే
[4]కడఁక సృష్టము లని కాంచఁ గలము. 10

తా॥ పరిశీలించి చూడ చంద్రుఁడు, సూర్యుఁడును, మేఘములు, చెట్లు, నదులు, గోవులను, మెత్తని మనసుగల సజ్జనులును పరులకు ఉపకారము చేయుటకొఱకే ఆ పరమదైవముచె సృష్టింపఁబడెననియని తెలిసికొనగలము

సం॥ రవిశ్చంద్రో ఘనా వృక్షా నదీ గావశ్చ సజ్జనాః,
ఏతే పరోపకారాయ భువి దైవేన నిర్మితాః.

ఆ. వె. చీమ చిన్న దయ్యుఁ జేరఁ గలదు ప్రాకి
నూరు [1]యోజనముల దూర మైన

---

9-1. ఎల్లపుడు 2. ప్రయత్నముతో 3. నశించు స్వభావము గలదని.
10-1. మేఘములు 2. మెత్తని చిత్తముగలవారు 3. ఉపకారము చేయుటకు 4. ప్రయత్నముతో.

[2]వైనతేయుఁడైన [3]పదము కదప కున్న
అడుగుదూర మైన నరుగ లేఁడు. 11

తా॥ చీమ మూడ చిన్న ప్రాణియే. దాని గమనవేగము తక్కువే. అయినను అది నెమ్మదిగ ప్రాకుచు నూరు ఆమడల దూరమైనను కొంత కాలమునకు చేరగలదు. గరుత్మంతుఁడు ఆకాశములో ఱెక్కలి పడిగా బోఁజాలినవాఁడైనను వెళ్లఁబూనకున్నచో ఒక్క అడుగైనను ముందునకు వెళ్ల లేఁడు. అల్పప్రయత్నమైనను నిరంతరము (ఎడతెగక) సాగినచో అది ఒకనాటికి సఫల మగును. మరియు అధికసామర్థ్యము ఉన్నను, దానికి తగు యత్నము చేయకున్నయెడల ఆ సామర్థ్యము సఫలము కాఁజాలదు.

సం॥ గచ్ఛన్ పిపీలికో యాతి యోజనానాం శతా న్యపి,
అగచ్ఛన్ వైనతేయోఽపి పద మేకం న గచ్ఛతి.

ఆ. వె. ఆత్మ కార్య మెఱిఁగి ఆచరింపఁదగును
కలుగు పిల్లి కి వలె ఫలము జగతి
పుట్టు మొదలు గోవుఁ బోషింప కున్న ను
దాని పాలె సతము త్రాగు తాను. 12

తా॥ తన కర్తవ్యమును తెలిసికొని దానిని ఆచరింపదగును. ఆ పనికి ఫలము మాత్రము పిల్లి కి కలిగినట్లే కలుగవచ్చును పిల్లి పుట్టినది మొదలు ఏనాడును గోవును పోషింపలేదు. అయినను అది ఎట్లో నిత్యము పాలు త్రాగుచున్నది. లోకమందు పాఁడి (పాలు) లేనివారెందరో పాలను, దాని పరిణామములగు పెరుగు, నేయి, మజ్జిగ మున్నగువానిని అనుభవించు చుండుట ఇట గుర్తింపదగును.

సం॥ ఉద్యోగ ఖలు కర్తవ్యః ఫలం మార్జారవద్భవేత్,
జన్మప్రభృతి గౌర్నాస్తి పయః పిబతి నిత్యశః.

11-1. ఆమడ 2. గరుత్మంతుడు 3. కాలు. 12. Nil.

ఆ. వె. చెడ్డ కార్య మొకఁడు చేయంగఁ జూచియే
1అన్యుఁ డొకఁడు దాని 2ననుకరించు
ఇల 3గతాను గతిక మీ జన మౌ. కావు
4పారమార్థికములు ప్రజల గతులు 13

తా॥ ఒకఁడు చెడ్డపని చేయఁగాఁ జూచి అన్యుఁడును వాని ననుస రించి అట్టి చెడ్డ పనినే చేయుచుండును. ఈ జనము ఇతరులను గ్రుడ్డిగా అనుసరించుచు ఆయా పనులను చేయుచుండును. దీనినే (అంధానుకరణ) మందురు. అంతేగాని తా మొనర్చు పనులయందలి మంచిచెడులను గుర్తించి మంచిని గ్రహించి చెడ్డను త్రోసివుచ్చుచు నడచుకొనరు గదా.

సం॥ ఏకస్య కర్మ సంవీక్ష్య కరోత్యన్యోఽపి గర్హితమ్,
గతానుగతికో లోకో న లోకః పారమార్థికః.

ఆ. వె. ధరణి నావుపాలు 1దధిరూప మందును
ఆ దినానొ లేక 2అపర మందొ
కాల మెంతొ గడవఁ 3గడలిపాల్ పెరు గౌనె?
4పృథ్వి 5మహితులకును 6విక్రృతి కలదె? 14

తా॥ పాలు అదేరోజునగాని. సమయము చాలకున్న మరుసటి రోజునగాని తోడుకొని పెరుగుగా మారుట అందరును ఎఱిఁగిన విష యమే. పాల సముద్ర మొకటి కలదని వినుచుందుముగదా! ఆ క్షీరసాగ రము ఎంతకాలము గడచినను పెరుగుగా మారిన జాడ నెరుఁగము. మహా శక్తి సంపన్నులకు ఎన్నటికిని వికారము కలుగదు

సం॥ గవాదీనాం పయోఽన్యేద్యుః సద్యో వా జాయతే దధి,
క్షీరోదధేస్తు నాద్యాపి, మహతాం వికృతిః కుతః.

---

13-1. ఇతరుఁడు 2. దానిని అనుసరించి చేయును 3. జరిగినదాని ననుస రించి నడచుకొనునది 4. వాస్తవములు; గొప్పప్రయోజనములు కలవి.
14-1. పెరుగు రూపు 2. మరియొకరోజున 3. సముద్రపు 4. భువిలో 5. గొప్పవారికి 6. వికారము.

ఆ. వె. సంప దాగమంబొ ఆప దాగమనంబొ
[1]మహితజనుల కౌను మహినిఁ జూడ
చంద్రుఁ డందుచుండు [2]సరవి [3]వృద్ధిక్షయాల్
[4]తార లంద విట్టి [5]తరతమంబు 15

తా॥ లోకమున మహాత్ములకే సంపదల రాకడ లేక ఆపదల రాకడ ఎక్కువగా జరుగుచుండును. రాత్రి నాకాశదీపకుఁడగు ఆ చంద్రుఁడే కొన్నాళ్ళు వృద్ధినందుచు మరికొన్నాళ్ళు క్షీణించుచుండును. కాని తారల కట్టి వృద్ధి క్షయములు లేవుగదా!

సం॥ సంపదో మహతా మేవ మహతా మేవ చాపదః,
వర్ధతే క్షీయతే చంద్రః న తు తారాగణః క్వచిత్.

ఆ. వె. [1]నింగినుండి పడెడు నీటి ధార లరయ
చక్కఁ జేరు గాదె సాగరంబు.
సకల దేవుల కిడు సర్వనమస్కృతుల్
అలరు [2]నచ్యుతునకు నమరఁ జేరు. 16

తా॥ ఆకాశమునుండి పుడమిపై బడు నీటిధారలు క్రమముగా సముద్రమునకు చేరును. అట్లే సమస్తదేవులకు జేయు నమస్కారములు ఆ యచ్యుతునకే చేరును.

సం॥ ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్,
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి.

---

15-1. గొప్పవారికి 2. క్రమముగా 3. హెచ్చుతగ్గులు 4 చుక్కలు.
16-1. ఆకాశమునుండి 2. విష్ణువునకు.

ఆ. వె. అవని కర్మ, [1]విత్త, మాయువు నరయంగ
చదువు, [2]నిధనము లవి చక్క నైదు
[3]కమల గర్భుఁ డెల్ల [4]గర్భగతుల కిచ్చు
కాన వాని మార్పఁ గాదు మనకు. 17

తా॥ బ్రహ్మదేవుఁడు భువిలోని ప్రాణుల కన్నింటికి ముఖ్యముగా నరులకు వారు గర్భస్థులైనపుడే చేయఁదగు కర్మ, ధనము, ఆయుఃపరిమాణము, చదువు, మరణము అను నైదింటిని నిర్ణయించును. కాన వానిని మార్చుట మన వశముగాదు.

సం॥ ఆయుః కర్మ చ విత్తం చ విద్యా నిధన మేవ చ,
పంచైతాన్యపి సృజ్యన్తే గర్భస్థస్యైవ దేహినః.

ఆ. వె. ఆత్మశక్తిచేత [1]యశము నుత్తముఁ డందు
తనరు మధ్యముండు తండ్రిశక్తి
అరయ [2]నధముఁ డందు యశము [3]మాతులునిచే
మామచే యశ [4]మధమాధముండు, 18

తా॥ తన శక్తిచేతనే కీర్తిఁ గాంచువాఁడు ఉత్తముఁడు. తండ్రి శక్తినిబట్టి కీర్తినందువాఁడు మధ్యముఁడు. మేనమామను బట్టి కీర్తిని బొందువాఁడు అధముఁడు. భార్య తండ్రినిబట్టి కీర్తిఁ గనువాఁడు అధమాధముఁడు.

సం॥ ఉత్తమా ఆత్మనా ఖ్యాతాః పిత్రా ఖ్యాతాశ్చ మధ్యమాః,
మాతులేనాధమాః ఖ్యాతాః శ్వశురేణాధమాధమాః.

---

17-1. ధనము 2. మరణము 3. బ్రహ్మ 4. గర్భమందున్నవారికి.
18-1. కీర్తి 2. హీనుఁడు 3. మేనమామనుబట్టి 4. హీనులలో హీనుఁడు.

ఆ. వె. కలుగు ఫలము జగతి కర్మ 1కధీనమై
2అలరు కర్మ బుద్ధి ననుసరించి
కాన నెల్ల పనులు కడఁక విచారించి
3ఎంచి బుద్ధి మంతుఁ 4డెసఁగఁ జేయు 19

తా॥ లోకమందు కష్టమో లేక నష్టమో అగుచు కలుగు ఫలము తానుచేసిన కర్మనుబట్టి యుండును. కర్మ బుద్ధి ననుసరించి జరుగును. కావున బుద్ధిమంతుడగు నరుఁడు అన్నిపనులను చక్కగా నాలోచించి నిర్ణయించి సఫలము చేసికొనవలెను.

సం॥ కర్మాయత్తం ఫలం పుంసాం, బుద్ధిః కర్మానుసారిణీ,
తథాపి సుధియా భావ్యం సువిచార్యైవ కుర్వతా.

ఆ. వె. పరుల కిచ్చుటయును, పరఁగ దీసికొనుట
భోజనంబు గొనుట, భుక్తి నిడుట
1గోప్య మడుగుచుంట, గోప్యంబుఁ దెల్పుట
నాగఁ బ్రీతి లక్షణంబు లారు 20

తా॥ ఇతరులకు అవసరమగు వస్తువుల నిచ్చుట, తన కవసరమగు వస్తువులను వారినుండి తీసికొనుట, వారియింట తాను భుజించుట, తనయింట వారి కన్నంబు పెట్టుట, దాఁచదగు విషయములను తాను వారి నడుగుట, తనకు దెలిసిన రహస్యములను వారికి దెల్పుట అను నారును పరస్పర ప్రీతిని దెల్పు లక్షణము లని చెప్పబడును.

సం॥ దదాతి, ప్రతిగృహ్ణాతి, గుహ్య మాఖ్యాతి పృచ్ఛతి,
భుంక్తే భోజయతే చైవ షడ్విధం ప్రీతిలక్షణమ్.

19-1. వశము 1, కలుగు లేక ఒప్పు 3, ఎన్నుకొని 4. ఒప్పునట్లు.
20-1. రహస్యము

ఆ. వె. [1]భవుఁడో [2]మాధవుండో [3]భవ్యదేవుఁ డొకఁడె
[4]యతియొ భూమిపతియొ [5]అనుఁగు నొకఁడె.
చూడ భార్య యొకటె సుందరియొ [6]దరియొ
వాస మొకటె [7]వనమొ పత్తనంబొ. 21

తా॥ శంకరుఁడనని, నారాయణుఁడనని సత్యమగు దేవుఁడు మాత్ర మొక్కడేగాని ఇద్దరు గారు. అట్లే రాగమారుఁడౌ యతియొ లేక రాగసక్తుడౌ మహారాజో ముఖ్యసఖుఁ డొక్కఁడే. సుందరియగు భార్యయొ లేక కొండగుహయొ ఏదో ఒక్కటే ఆశ్రయింప దగినది. వనమో లేక పత్తనమో ఏదో ఒక్కటే నివాసమునకు తగు చోటు. అనగా పేర్లు వేర్వేరుగ పెట్టి యున్నంతమాత్రాన దేవుఁడు భిన్నరూపుడు కాడనియు, ఆరాధ్య దేవుడొక్కడనియు, విరాగియై అడవి కేగి యే కొండగుహలోనో ఉండి తపస్సుచేసి తరించుటయో లేక భోగాసక్తిచే సంసారియై మహారాజువలె జీవితలక్ష్యమునే మఱచి జీవించుటయో ఏదో ఒక్కటే ఆచరింపదగు విధానమనియు తెలియవలెను నరుడు మానవజీవిత గమ్యము నెఱిగిన యోగియో మానవజీవిత లక్ష్యమును మఱచిన భోగియో కావలెనన్నమాట.

సం॥ ఏకో దేవ: కేశవో వా శివో వా, ఏకా నారీ సుందరీ వా దరీ వా,
ఏకం మిత్రం భూపతిర్వా యతిర్వా, ఏకో వాసః పత్తనే వా వనే వా.

ఆ. వె. జనుల కెవరి కేమి జరుగునో మఱునాఁడు
ఎఱుఁగ రా [1]దొకింత యేరి కైన
కాన [2]సుధియు లరసి పూని ఱేపటి విధుల్
తెలిసి యీ దినానఁ [3]దీర్పవలయు. 22

తా॥ మరుదినము ఎవరికేమి జరుగగలదో ఎవ్వరికి నేమాత్రము తెలియదు. కావున మంచి బుద్ధిమంతులు పరిశీలించి, రేపటి కర్తవ్యవిము లేమొ తెలిసికొని నేడే వానిని నెరవేర్పవలెను.

---

21-1. శంకరుఁడు 2. విష్ణువు 3. సత్యమైన 4. వైరాగ్యము కలవాడు 5. ముఖ్యసఖుఁడు 6. కొండగుహ 7. అడవియొ. 22-1. కొంచెముకూడ 2. బుద్ధిమంతులు 3. చక్కఁబఱచవలయు.

సం॥ న కశ్చిదపి జానాతి కిం కస్య శ్వో భవిష్యతి,
అత: శ్వః కరణీయాని కుర్యా దద్యైవ బుద్ధిమాన్.

ఆ. వె. [1]అధము నాశ్రయుం బ దరయఁ జేయఁ దగదు
మహితు నాశ్రయంబు [2]మాన్య మగును.
[3]ఈశు నాశ్రయమున [4]నెసఁగు మహాసర్ప
మడిగె గరుడుఁ గుశల [5]మాము మిగుల. 23

తా॥ పరిశీలించుచూడ లోకమందు అధముని ఆశ్రయించుట తగదు. మహాత్ముని ఆశ్రయించుట మన్నింపదగును. ఈశ్వరుని ఆశ్రయమును బొందిన పాము అహంభావము అతిశయించుటచే గరుడుని కుశలమా అని అడిగినదట. లోకములో గరుత్మంతుఁడు పాములకు పరమశత్రువై వాని జూచినంతనే చంపబూనును అని నమ్ముదురు. దీనికి భిన్న మీ శ్లోక భావము. అట్టి స్థితికి పామునకు మహితుఁడగు శివుని ఆశ్రయము దొరకుటచే కలిగిన గర్వము లేక అహంకారము ఇట కారణముగ చెప్పబడెను.

సం॥ నీచాశ్రయో న కర్తవ్య: కర్తవ్యో మహదాశ్రయ,
ఈశాశ్రయో మహానాగః ప్రవచ్ఛ గరుడం సుఖమ్.

ఆ. వె. ఏ [1]దశక్య మౌనొ, కాదు శక్యం బది
శక్య మేది యౌనొ జరుగు నదియె
బండి నీటఁ బోదు, పడవ ధరణిఁ బోదు
తెలిసి మెలఁగ వలయు తెలుఁగు బిడ్డ. 24

తా॥ ఏది అశక్యమో (నశక్యము కానిదో)అదియెన్నడును శక్యము (సాధ్యము లేక వశము) కాఁజాలదు. ఏది శక్యమగునో అది తప్పక జరుగగలదు లోకమందు బండి లోఁతు నీటిలోఁగాని, పడవ భూతలము మీఁదగాని పోఁజాలదు. బండికి జలగమనము, పడవకు భూతల గమనము అశక్య విషయములు. కనుక నట్లు జరుగఁజాలదు.

---

23-1. నీచుని 2. పూజ్యము 3. ఈశ్వరుని 4. అతిశయించు గర్వముచే.
24-1. జరుగరానిది.

సం॥ య దశక్యం న తచ్ఛక్యం యచ్ఛక్యం శక్యమేవ తత్,
న జలే శకటం యాతి, న చ నౌర్గచ్ఛతి స్థలే.

ఆ. వె. [1]దైవ మెన్న [2]మిన్న ధరణి నందఱికంటె
[3]పౌరుషంబు కూడ వ్యర్థ మౌను.
[4]తలఁగిపోయెఁ పాము [5]దైవాను కూల్యాన
పొందె నాశ మౌర! మూషికంబు. 25

తా॥ పరికింప దైవము భువియందు అందరికంటెను, అన్నిటి కంటెను మించినది మానవ యత్నము కూడ నిష్ఫల మగును. బుట్టలో బంధింపబడిన పాము దైవానుకూలతచే, రంధ్రముచేసికొని వచ్చిన ఎలుకను తిని, ఆ యెలుక చేసిన రంధ్రము నుండియే వెడలిపోయెను.

సం॥ దైవమేవ పరం మన్యే పౌరుషం తు నిరర్థకమ్,
దైవేన రక్షితః సర్పః మూషికశ్చ వినాశితః.

ఆ. వె. భయము నిచ్చు గాలి[1]పాదపములకెల్ల
భయము నిచ్చు [2]సీతు [3]పద్మవనికి
భయము నిచ్చు [4]నశని పర్వతంబుల కెల్ల
[5]జంకుఁ గూర్చు [6]తులువ సజ్జనులకు. 26

తా॥ పెనుగాలి చెట్లకెల్ల భయమును కల్గించును. శిశిరఋతువు పద్మములకెల్ల భయమును కలుగజేయును. వజ్రాయుధము కొండలన్నింటికి భయమును గూర్చును. దుర్జనుఁడు సజ్జనులకు భయంకరుఁడు.

సం॥ పాదపానాం భయం వాతః పద్మానాం శిశిరం భయమ్,
పర్వతానాం భయం వజ్రం సాధూనాం దుర్జనో భయమ్

---

25-1. విధి 2 గొప్పది 3. మానవకృషి 4. తొలఁగి 5. దైవము అనుకూలమగుటచే 26-1. చెట్లకు 2 శిశిరఋతువు 3. పద్మముల సమూహమునకు 4. వజ్రాయుధము 5. భయము 6. దుష్టుడు.

ఆ. వె. హ స్తభూషణం బ దరయ దానమె యౌను
కంఠభూష యౌను [1]కామ్య ఋతము.
[2]శ్రోత్ర భూషణంబు [3]స్తుత్యశాస్త్రమె యౌను
ఇతరభూషణముల నేమి ఫలము. 27

తా॥ దానమే చేతి కలంకారము. మనోహరసత్యమే (నిజము చెప్పుటయే) కంఠమునకు అలంకారము. స్తుత్యమగు శాస్త్రమే (శాస్త్రమును వినుటయే) చెవుల కలంకారము. ఇతరములగు నగలచే ప్రయోజనమేమి? లేదని భావము.

సం॥ హస్తస్య భూషణం దానం, సత్యం కంఠస్య భూషణమ్.
శ్రోత్రస్య భూషణం శాస్త్రం, భూషణైః కిం ప్రయోజనమ్.

ఆ. వె. విద్యవలని ఫలము [1]వెలయు [2]వినయ మౌను,
మనుజుఁ [3]పాత్రుఁ జేయు [4]వినతి పథమె
[5]పాత్రతత వెలయించు పరఁగు ధనము, దాన
ధర్మ మమరు, నంత [6]తనరు సుఖము. 28

తా॥ శోభను కలిగించు వినయమే విద్యకు తగు ఫలము. ఈ వినయము మనుజుని యోగ్యునిగా చేయును యోగ్యతవలన ధనము లభించును. ధనమువలన ధర్మము చేయనగును. ఆ ధర్మమువలన సుఖము అతిశయించును

సం॥ విద్యా దదాతి వినయం వినయా ద్యాతి పాత్రతామ్,
పాత్ర త్వాద్ధన మాప్నోతి, ధనా ద్ధర్మం తతః సుఖమ్.

---

27-1. మనోహరమగు సత్యము 2. చెవులకు 3. కొనియాడదగిన సత్యము.
28-1. శోభించు 2, 4. అణఁకువ పద్ధతి 3 యోగ్యుని 5. యోగ్యత 6, అతిశయించు.

ఆ. వె. [1]సద్గుణజనమైత్రి చలుపుచు నుండెనే
నల్పుఁడైన పొందు [2]నధికమహిమ.
[3]కుసుమ మాలతోడఁ గూడిన దారంబు
తాల్పఁబడును జనుల తలల యందు. 29

తా॥ గుణవంతులగు జనులతో మైత్రి గల అల్పజనుఁడుచు అధిక మగు మహిమను పొందును. ఎట్లన, పూలమాలతో కూడియున్న దార మును కూడ జనులు శిరసావహింతురు. (తలఁదాల్తురు, అధికగౌరవముతో స్వీకరింతురని భావము).

సం॥ గుణవ జ్జనసంసర్గా ద్యాతి స్వల్పోఽపి గౌరవమ్,
పుష్పమాలానుషంగేణ సూత్రం శిరసి ధార్యతే.

ఆ. వె. చక్కఁ బలుకవలయు [1]సతతంబు సత్యమే,
పలుక రా దబద్ధవచన మెపుడు
వచ్చె [2]వ్యాఘ్ర మనుచు బాలుఁ [3]డనృత మాడ
కావ వచ్చి, జనులు కనరె నిజము. 30

తా॥ ఎల్లప్పుడు సత్యమునే చక్కఁగా పలుకవలెను. ఎన్నడును అబద్ధమాడరాదు. గోపబాలుఁ డొకఁడు "వ్యాఘ్రము వ్యాఘ్ర"మని అబ ద్ధము చెప్పఁగా ఆ బాలుని రక్షించుటకై వచ్చి, జనులు నిజమెరిఁగి వెళ్లి పోయిరి గదా!

సం॥ సత్యమేవ సదా భాష్యం అసత్యం న కదా చన,
అసత్యభాషీ గోపాలో యతో వ్యాఘ్రేణ శిక్షితః.

---

29-1. సద్గుణములుగల జనులతో స్నేహమును 2. మిగుల గొప్పతన మును 3. పూలమాలతో 30—1. ఎల్లప్పుడు 2. పెద్దపులి 3. అబద్ధము.

ఆ. వె. [1]అనృత మాడు మనుజుఁ డనుచు పేర్వడసెనే
నతఁడు చెప్పు నిజము ననృత మంద్రు
[2]అనృతభాషి యైన ఆ గోపబాలుండు
పెద్దపులికిఁ జిక్కి [4]బిద్దె గాదె. 31

తా॥ ఒకఁడు "అసత్యవాది" అని పేరు పొందినచో అతఁడు నిజము చెప్పినను అది అబద్దమే అని యందురు. కావుననే అసత్యవాది యగు గోపబాలుఁడు పెద్దపులికి చిక్కి మరణమందెను,

సం॥ అసత్యవాదినా ప్రోక్తం సత్యమప్యనృతం భవేత్,
అసత్యవాదిబాలోక్తం శార్దూలాగమనం యథా.

ఆ. వె. జనుఁ [1]డుదధిజలమున మునిగి నపుడె గాని
కొండ నుండి పతన మందినపుడొ
పాముచేత కాటుఁ బడసినపుడె గాని
[2]ఆయు వొకటె చేయు ప్రాణరక్ష. 32

తా॥ మానవుఁడు సముద్రజలములో మునిగినపుడుగాని, కొండ కొననుండి క్రింద పడినపుడుగాని, పాము కాటు వేసినపుడుగాని వానికున్న ఆయువు మాత్రమే వానిని రక్షించును. కావున నట్టి దశలోను అతఁడు చావఁడు.

సం॥ నిమగ్నస్య పయోరాశౌ పర్వతాత్పతితస్య చ,
తక్షకేనాపి దష్టస్య ఆయుర్మర్మాణి రక్షతి.

---

31-1. అబద్ధము 2. అసత్యవాది 3. గోపాలకునిబిడ్డ 4. చచ్చె.
32-1. సాగర జలములో 2. విధి నిర్ణయించిన ఆయుష్యము.

ఆ. వె. 1 స్థిరము విడిచి నరుఁ డస్థిరమునె సేవింప
2అమర దస్థిరంబు 3నరుగు స్థిరము
ఉభయ దూరుఁ డయ్యె నొప్పు నా నరునకు
4శుభము కలుగకుంట 5చోద్య మగునె? 33

తా॥ మానవుఁడు స్థిరవస్తువును విడిచిపెట్టి అస్థిర వస్తువును సేవింపబూనినచో అపు డస్థిరవస్తువు లభింపదు. స్థిరవస్తువు అనాదరణచే దూరమగును. ఆ విధముగా స్థిర-అస్థిర వస్తువుల రెంటికి దూరమగువానికి మేలు కలుగకుండుటలో నాశ్చర్యమేమున్నది.

సం॥ ధ్రువం వస్తు పరిత్యజ్య యోఽధ్రువం వస్తు సేవతే,
ధ్రువాధ్రువే ఉభే తస్య వినశ్యేతాం న సంశయః.

ఆ. వె. 1స్వీయ 2మభ్యుదయము 3చెలఁగంగఁ గోరిన
వదల వలయు నరుఁడు వ్యర్థకర్మ.
అటుల కాని యెడల నతఁడు వినాశ మౌ
4చీలఁ జెఱికి కోఁతి 5చెల్లి నట్లు. 34

తా॥ తన అభివృద్ధిని పెంచుకొనగోరు నరుఁడు వ్యర్థములగు కార్యములను విడువవలెను విడువకున్న అతఁడే అంపపుకోతవారు నిల్పిన చెక్కను జెఱికిన కోఁతిపలె వినాశ మందును.

సం॥ న కుర్యా న్నిష్ఫలం కర్మ య ఇచ్ఛేద్భూతి మాత్మనః,
అన్యథా ప్రాప్నుయా న్నాశం కీలోత్పాటీవ వానరః.

---

33-1. నాశములేనిది లేక నిలుకడగలది 2. కుదురుగానుండదు 3.పోవును 4. మేలు 5 ఆశ్చర్యకరము. 34-1. తనదగు 2. అభివృద్ధి లేక ఉన్నతి 3. అతిశయింప 4. చెక్కను 5. చచ్చి.

ఆ. వె. [1]వసుధ [2]నున్నతిఁ గను వంశమెవనిచేత
[3]సార్థకంబు వాని జన్మ మొకటె
చక్రరీతిఁ దిరుగు సంసారమున్ జూడ
చచ్చి, యెవఁడు తిరిగి జన్మఁ గనఁడు? 35

తా॥ ఈ భువిలో నెవనిచేత వాని వంశమున్నతిని బొందునో వాని జన్మమే సార్థకము లేక సఫలము. క్రింది మీఁదలు నారుచుండు చక్రము వలె తిరుగు ఈ సంసారములో చచ్చినవాఁడు తిరిగి జన్మించుచునే యుండును జన్మించినవాడును ఒకనాటికి చచ్చును.

సం॥ స జాతో యేన జాతేన యాతి వంశః సమున్నతిమ్,
పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే.

ఆ. వె. [1]కోటరంబునందు [2]కుములు నగ్ని వహించు
[3]కుతరు వొకటి? కానఁ [4]గుదురు కొనఁగ
వన మ [5]దంతరించు వహ్ని [6]దగ్ధ యగుచు
కులము [7]కుసుతుచేత [8]కుందు నట్లు 36

తా॥ చెట్టు తొఱ్ఱయందు కుములుచున్న అగ్ని యున్నది. అట్టి చెట్టొకటి అడవిలో నుండెనేని ఆ చెట్టు తొఱ్ఱలోనుండి పెంపొండిన అగ్ని ఆ వనము నంతయు కాల్చివేయును. ఎట్లన.- ఒక కులములో దుర్జనుఁడు అగు నొక పుత్రుఁడున్నచో అ వంశమంతయు వానివలన దుఃఖమనుభవించుట ప్రత్యక్షమే కదా.

సం॥ ఏకేనాపి కువృక్షేణ కోటరాంతరగాగ్నినా,
దహ్యతే తద్వనం సర్వం కుపుత్రేణ కులం యథా.

35-1. భువిలో 2. పెంపును 3. సఫలమగు లేక ధన్యము. 36-1. (చెట్టు) తొఱ్ఱలో 2. లోలోపల దహించు 3 చెడ్డ (ఎండిన) చెట్టు 4. కదలక నిలుపగా 5. నశించు 6. కాల్చబడినది 7. దుష్టుఁడగు పుత్రునిచే 8. దుఃఖించు. 9 అడవిలో

ఆ. వె. అపహరింపఁ బడియె ¹నతిరూప జానకి
²నడిసె రావణుఁ ³డతిమదముచేత
⁴అతివితరణ బద్ధుఁ డయ్యెను ⁵బలి, కాన
⁶"అతి, తగ దెపు డెచట" ననుట నిజము. 37

తా॥ అతిశయించిన రూపసౌందర్యముగల సీతాదేవి రావణునిచే అపహరింపబడినది. అతిశయించిన గర్వముచే రావణుఁడు తుదకు మరణించెను. అతిశయించిన దానము నకు బలి చక్రవర్తి బద్ధుఁడై నశించెను. కావున ఎప్పుడైనను, ఎక్కడైనను అతిగ అనగా మితిమీఱి వ్యవహరించుట ఎవ్వరికిని తగదు.

సం॥ అతిరూపాద్ధృతా సీతాఽతి గర్వాద్రావణో హతః,
అతిదానాద్బలిర్బద్ధో హ్యతి సర్వత్ర వర్జయేత్.

ఆ. వె. ¹క్షాంతి ధనువుఁ దాల్చు సత్పురుషున కిల
చేయ లేఁడు కీడు ²చెనఁటి యెపుడు
పరకలేని చోట పడు ³పావకుండును
వృద్ధిఁ గనక తాను ⁴కృశతఁ గాంచు. 38

తా॥ ఓర్పు అనెడి ధనుస్సును (విండిని) ధరించిన సజ్జనునకు ఈ భువిలో ఏ దుర్జనుఁడును కీడు చేయఁజాలఁడు. గడ్డిపోఁచ లేనిచోట నిప్పు రవ్వ పడినను అది పెంపు గాంచక తనంతట తానే ఆరిపోవును.

సం॥ క్షమాధనుః కరే యస్య దుర్జనః కిం కరిష్యతి,
అతృణే పతితో వహ్నిః స్వయమేవోపశామ్యతి.

---

37-1. మిక్కిలి అందముగల సీత 2. చచ్చెను 3 అమిత గర్వముచే 4. అధిక దానముచే 5. బలి చక్రవర్తి 6. అతిగ వ్యవహరించుట.

38-1. ఓర్పు అనెడి విల్లు 2. దుర్మార్గుడు 3. అగ్ని 4. క్షయము (కృశించుట).

ఆ. వె. సుతులు లేని ప్రజకు [1]సుగతియె లేదెందు
సుతరహితుఁడు [2]దివము [3]చూరఁ గొనునె?
తనయుముఖము, [4]గనిన తండ్రియే యీ ధర
తపము చేసి తాను [5]తనరఁ గలఁడు. 39

తా॥ పుత్ర సంతానము లేని జనులకు సద్గతియే లేదు. కొడుకులు లేనివారు స్వర్గమును పొందలేరు. కావున సుతుని ముఖము చూచిన అనగా పుత్రుని గనిన తండ్రిమాత్రమే పిదప తపస్సుచేసి తాను తరింపఁగలడు.

సం॥ అపుత్రస్య గతిర్నాస్తి స్వర్గో నైవ చ నైవ చ,
తస్మా త్పుత్రముఖం దృష్ట్వా పశ్చాద్భవతి తాపసః.

ఆ. వె. క్షణము [1]తుష్టి, [2]కినుక క్షణము, చూపు నరుఁడు
కోప-తాపములతొ కూడి నడచు
మది నిలుకడ లేక మసలుచుండు నరుల
[3]ఆదరమును [4]భయదహానిఁ గూర్చు. 40

తా॥ ఒక క్షణకాలము సంతోషము, మరుక్షణము కోపమును చూపుచు కోపతాపములకు తఱచు లోనగుచు మనస్సు నిలుకడలేని నరులు ఆదరించినను అది భయంకరమై ఏదో హానినే కలిగించును.

సం॥ క్షణే తుష్టాః క్షణే రుష్టాస్తుష్టా రుష్టాః క్షణే క్షణే,
అవ్యవస్థితచిత్తస్య ప్రసాదోఽపి భయంకరః.

---

39—1, సద్గతియే 2. స్వర్గము 3. కొల్లగొనుట 4. చూచిన 5. ఒప్పు (ఇట తరింపగలడని భావము).

40-1. సంతోషము 2. కోపము 3. అనుగ్రహమును 4 భయంకరమగుకీడు

ఆ. వె. స్వాభిమానము నెవఁ [1]డర్థంబుగా నెంచు
అతఁడె చిరము బ్రదికి యశముఁ గాంచు
[2]మాన, మాదరంబు మహి నెవరికి లేదొ
వాని [3]కాయు రర్థఫలము గలదె. 41

తా॥ ఏ నరుఁడు అభిమానమునే ధనముగ దలంచునో అతఁడు చిర కాలము జీవించి కీర్తిని బొందును. ఏ జనునకు భువిలో మానమర్యాదలే లేవో అతనికి దీర్ఘాయువు, ఐహికధనము ఉన్నను ఫలమేమి? అవి నిష్ఫలములని భావము.

సం॥ అభిమాన ధనం యేషాం చిరం జీవన్తి తే నరాః,
అభిమాన విహీనానాం కిం ధనేన కి మాయుషా.

ఆ. వె. [1]బుధుఁడు [2]జరను, [3]మృతిని వదలిన రీతిగా
ధనము, చదువు నందఁ దలఁప వలయు,
జుట్టు పట్టు [4]మిత్తిఁ జూచు [5]శూరుపగిది
ధర్మ మెపుడుఁ జేయఁ దలఁపవలయు. 42

తా॥ విద్వాంసుఁడు ముసలితనముగాని మరణముగాని లేని నరుని వలె ధనమును, చదువును సంపాదింప దలపవలెను. అట్లే తన జుట్టు మృత్యువు చేతిలో చిక్కుకొనిన శూరునివలె ఎల్లప్పుడు ధర్మకార్యములనే చేయదలంపవలెను. అనగా ముదిమినిగాని మృత్యువునుగాని లెక్కజేయక ధనార్జనకు, విద్యార్జనకు శక్తికొలఁది బ్రతికినంతకాలము నరుఁడు పాటుపడవలయును మరణ మేక్షణమున కలుగునో తెలియదు గాన ధర్మాచరణములో ఏమరుపాటు తగదని గుర్తింపవలెనని భావము.

సం॥ అజరమరవత్ ప్రాజ్ఞః విద్యా మర్థం చ సాధయేత్,
గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మ మాచరేత్.

---

41-1. ధనముగా 2. ఆత్మాభిమానము 3. దీర్ఘాయువు, పూర్తిసంపద వలన లాభము. 42-1. పండితుఁడు 2. ముసలితనము 3, 4. చావు (మృత్యువు) 5. వీరునివలె,

ఆ. వె. [1]పద్మజాత! నీవు వ్రాయు పాపఫలము
[2]లన్యముల [3]నవశ్య మనుభవింతు
[4]సరసకవిత [5]విరసజనులకు వినిపింప
వలదు వలదు [6]నుదుట వ్రాయ వలదు. 43

తా॥ ఓ బ్రహ్మదేవుడా! నీవు నా నొసట వ్రాయునట్టి ఇతర పాపముల ఫలములను నేను తప్పక అనుభవింతును. కాని సరసులుకాని వారికి సరస కవితను వినిపింపఁ జేయునట్లుగా నా నొసట వ్రాయవలదు, వ్రాయవలదు.

సం॥ ఇతరపాపఫలాని యథేచ్ఛయా లిఖితాని సహే చతురానన!,
అరసికేషు కవిత్వనివేదనం శిరసి మాలిఖ, మాలిఖ, మాలిఖ.

ఆ. వె. అవని [1]నర్థహీను లర్థంబు నర్థింత్రు
[2]గో ప్రభృతులు [3]నుడులఁ గోరుచుండు
వసుధ జనులు [4]దివము [5]వాంఛించుచుందురు.
[6]అమరు లెల్ల [7]ముక్తి నంద నెంత్రు. 44

తా॥ భువిపైనుండు దరిద్రులు ధనమునే కోరుదురు. గోవులు మొదలగు మాటలురాని ప్రాణులు మాటలు రా గోరును. భూజను లెల్ల స్వర్గమును వాంఛింతురు. స్వర్గమందుండు దేవతలందరు మోక్షమును కోరుదురు.

సం॥ అధనా ధన మిచ్ఛన్తి వాచం చైవ చతుష్పదః,
మానవా స్వర్గ మిచ్ఛన్తి మోక్ష మిచ్ఛన్తి దేవతాః.

---

43-1. ఓ బ్రహ్మదేవా! 2. ఇతరములు 3. తప్పక 4. రసవంతమగు కవిత్వము 5. రసము గ్రహింపలేని 6. నొసట. 44-1. దరిద్రులు 2. గోవులు మొదలగు ప్రాణులు 3. మాటలను 4. స్వర్గము 5. కోరుదురు 6. దేవతలు 7. మోక్షము.

ఆ. వె. సారహీన మైన సంసార మందున
[1]భ్రమయె కాని సుఖముఁ బడయఁ గలమె?
పాలు గోరి [2]శిశువు వ్రేలు నోట [3]నునిచి
భ్రాంతిపడుటె గాని ఫలముఁ గనునె? 45

తా॥ సంసారమందు సార మాశించునంతగా నుండదు. అయినను సారమున్నదని భ్రాంతిపడుదురేకాని అందు సుఖమును బొందఁజాలరు. ఎట్లన శిశువు పాలు త్రాగఁగోరి, వ్రేలిని నోటిలో నుంచి భ్రమపడునేగాని పాలు లభించవుగదా!

సం॥ అసారే ఖలు సంసారే సుఖభ్రాంతిః శరీరిణామ్,
లాలాపాన మివాంగుష్ఠే బాలానాం స్తన్య విభ్రమః.

ఆ. వె. అవనిఁ గొంద [1]ఱప్రియము లాచరించియు
[2]శిష్టు లౌదు రౌర! జీవయాత్ర
అవని నరులసొమ్ము నంతఁ గాల్చెడు నగ్ని
వారి పూజ లంది పరఁగుచుండు. 46

తా॥ ఓ మిత్రమా! కొందరు జనులు కొందరికి ప్రియముగాని పనులు చేసియు శిష్టులే అగుచుందురు. ఈ లోకమందలి జీవయాత్ర బహు విచిత్రమైనది. జనుల సర్వస్వము (సకల విధములగు సంపద)ను దహించెడు అగ్ని వారికి ఆదరపాత్రుఁడగుట లోకమున ప్రత్యక్షమే గదా!

సం॥ అప్రియాణ్యపి కుర్వాణో యః ప్రియః ప్రియ ఏవ సః,
దగ్ధమందిరసారేఽపి కస్య వహ్నావనాదరః?

---

45-1. భ్రాంతి 2. పసిబిడ్డ 3. ఉంచి.

46-1. ఇష్టముకాని పనులు 2. మంచివారు.

ఆ. వె. సత్యసేవచేత [1]సంప్రీతుఁ డౌ రాజు
ధనముకంటె గొప్పదాని నీఁడు.
శిష్యుసేవఁ [2]దనియు శిష్టగురువరుఁడు
జన్మ [3]ధన్యతఁ గను జ్ఞాన మిచ్చు. 47

తా॥ సేవకుఁ డొనర్చు సేవను గాంచి ప్రీతిఁ జెందిన రాజు పెద్ద మొత్తము ధనమును మాత్ర మీయఁ గలఁడు. అంతకంటె గొప్ప వస్తువు నీయలేఁడు శిష్యుఁ డొనర్చు సేవచే తృప్తిపడిన సదాచారసంపన్నుఁడగు గురువు జన్మను సార్థకముచేయు జ్ఞాన మీయఁ గలడు. (ఇట ద్వితీయార్థ భావము మార్చి వ్రాయబడినది).

సం॥ తుష్టో హి రాజా యది సేవకేభ్యః భాగ్యాత్పరం నైవ దదాతి కించిత్,
అహర్నిశం వర్షతి వారివాహః తథాఽపి పత్రత్రితయః పలాశః.

ఆ. వె. [1]పడఁతి [2]ప్రబల యైన, బాలుఁ [3]డధిపుఁడైన
మంత్రి చదువె లేక [4]మమత, జూప
అర్థికాభివృద్ధి కాశ లేనే లేదు
బ్రతుకుఁదెరువ దైనఁ [5]బట్ట గలదె? 48

తా॥ అబల ప్రబలయౌట, అనుభవములేని బాలుఁడు రాజ్యపాలనము చేయుట, మంత్రి మంచి విద్యావంతుఁడుకాని వాఁడయ్యు పాలనలో తల దూర్చుట జరుగునపుడు ఆర్థికాభివృద్ధి కలుగు నాశ ఉండదు సరిగదా ప్రజలకు బ్రదుకు దారియు దొరకదు.

సం॥ అబలా యత్ర ప్రబలా, బాలో రాజా, నిరక్షరో మన్త్రీ,
న హి నహి తత్ర ధనాశా, జీవిత ఆశాపి దుర్లభా భవతి.

---

47-1. మిక్కలి ప్రీతిని పొందిన 2. తృప్తిపడు 3. సార్థకమగుటను.
48-1. స్త్రీ 2 బలముగలది 3. రాజైన 4. (పాలనయందు) ఆసక్తిని 5. కలుగ గలదా?

ఆ. వె. అన్యసతుల నెల్ల నాత్మమాత పగిది
పెఱల [1]ముల్లె మట్టి పెళ్ల రీతి
[2]అన్యభూతచయము [3]నాత్మతో సమముగా
తలఁచు నరుఁడె [4]సత్య తత్త్వవేత్త. 49

తా॥ పరకాంతల నందఱిని తన తల్లి వలెను, పరుల ధనమును మట్టిగడ్డవలెను, సర్వ జీవులను తనవలెను తలంచు మానవుఁడే సత్యమును ఎఱిగినవాఁడు.

సం॥ మాతృవత్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్,
ఆత్మవత్సర్వ భూతాని యః పశ్యతి స పశ్యతి.

ఆ. వె. సకల జన్తువులకు జనుల, కెల్ల నిలను
[1]భుక్తి, నిద్ర, భయము, [2]రక్తి సమము
[3]వెలయు నరుల కొక [4]వివేక మధికమౌను
పశుసముఁ డది లేక [5]వఱలు నరుఁడు. 50

తా॥ ఇలలో ఇతరములగు సర్వజీవులకును, మానవులకును ఆహారము, నిద్ర, భయము, అనురాగము అనునవి సమానమే. కాఁగా నరులకు వివేకమనునది ఒకటి అధికముగా నుండును. ఆ వివేకములేక ప్రవర్తించు మానవుఁడు పశుతుల్యుఁ డగును.

సం॥ ఆహార-నిద్రా-భయ-మైథునాని సమాన మేతత్ పశుభిర్నరాణామ్,
ఏకో వివేకో హ్యధికో మనుష్యే తేనైవ హీనః పశుభిః సమానః.

---

49-1. డబ్బుమూట 2. ఇతర జీవసమూహము 3. తనతో 4. సత్యసార మెఱిఁగినవాఁడు 50-1. ఆహారము 2. అనురాగము 3. ప్రకాశించును. 4. సత్య మేదియో అసత్య మేదియో గుర్తించు తెలివి 5. ప్రవర్తించు.

ఆ. వె. [1]తనరు నాశ కెవరు [2]దాసులై యుందురో
ధరణి వారు జనుల దాసు లౌదు
రాశ దాసియయ్యె [3]నలరు [4]నెరికి, వారి
కవని జనులు దాసు లౌదు రంద్రుడు. 51

తా॥ ఆశకు లోబడు జనులు తదితర నరులందరికిని దాసులు (సేవకులు) అయి జీవించుట తప్పదు. ఎవరికైతే ఆశయే దాసివలె మెలఁగునో అనఁగా ఎవరు ఆశకు లొంగరో వారికి సకలజనులు దాసులై మెలఁగుదురు.

సం॥ ఆశాయా యే దాసా లోకే తే దాసా సర్వలోకస్య,
ఆశా యేషాం దాసీ తేషాం దాసాయతే లోకః.

ఆ. వె. [1]సౌమ్యుఁడైన [2]శశిని స్వశిరమందె శివుఁడు
తాల్చి యుండు టరయ [3]తథ్య మగును.
ఐన శశియు [4]కృశత నందుచుండును సుమ్ము
పరుల పొందు [5]కష్టతరము గాదె! 52

తా॥ శివుఁడు మృదుస్వభావము గలవాఁడై తన శిరమున చంద్రుని ధరించుట వాస్తవమే. అటుల ఈశ్వరకరుణకు పాత్రుఁడయ్యు ఆ చంద్రుఁడు కృశించుచుండుట ప్రత్యక్షమే. దీనినిబట్టి పరుల నాశ్రయించుటవలన కష్టములు తప్పవు అని స్పష్టము.

సం॥ శిరసా ధార్యమాణోఽపి సోమః సౌమ్యేన శంభునా,
తథాపి కృశతాం ధత్తే కష్టః ఖలు పరాశ్రయః.

---

51-1. ఒప్పు 2. సేవకులై (లోవడినవారై) 3 వ్యవహరించును. 4. ఎవరికి 52-1. చల్లనివాఁడగు 2. చంద్రుని 3. నిజము 4. కృశించు టను 5. మిక్కిలి కష్టము.

ఆ. వె. [1]ఎన్న మూఢభావ మెంతొ [2]కష్టకరము
యౌవనమున [3]దైన్య మట్టి దగును
పరులకూడు నరయఁ బరగృహవాసంబు
కష్టముల [4]నసహ్య కష్టమగును. 53

తా॥ జను లెల్ల రకు మూఢత్వము ఎంతో కష్టమును కలిగించును. యౌవనదశలో దరిద్రుఁ డగుటయు అట్టే కష్టములకు కారణమగును. పరిశీలింప పరుల యిండ్లయందు నివసించుట, పరులు పెట్టు కూడు తిన వలసివచ్చుట అనునవి కష్టములలోకెల్ల ఓర్వశక్యముకాని కష్టములు.

సం॥ కష్టం ఖలు మూర్ఖత్వం, కష్టం ఖలు యౌవనే దారిద్ర్యమ్,
కష్టాత్కష్టతరం కిం? పరగృహవాసః, పరాన్నం చ.

ఆ. వె. నరుల దేహము లవి [1]నశ్వరంబులె యౌను
నీటి బుడగ యటులె నిలుచు [2]సిరియు
మృత్యు వెపుడు వెంట మెలఁగు చుండును, గాన
కనఁగ ధర్మ మొకటె [3]కార్య మగును. 54

తా॥ మానవుల శరీరములు తప్పక నశించునవే యనుట నిజము. లక్ష్మి నీటిబుడగవలె మనల జేరి యుండును. అదెంత కాలము మనవద్ద ఉండునో తెలియదు. మృత్యుదేవత జనులను నిత్యము వెన్నంటి యుండును కావున నరుల ముఖ్యకర్తవ్యము ధర్మమును ఆచరించుటయే.

సం॥ అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః,
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః.

---

53-1. గణింప. 2. కష్టమును కల్గించునది. 3. దారిద్ర్యము.
4. ఓర్వశక్యముగాని కష్టము. 54-1. నశించు స్వభావము గలవి 2. లక్ష్మి
3. చేయఁదగినది.

ఆ. వె. కాకి నలుపు, కనఁ [1]పికం బటులె నలుపు,
ఆకృతిఁ గని భేద [2]మరయ లేము
ఆ వసంతఋతువు ప్రాప్త మైనంతనే
కాక-పికరుతంబు కలియ కుండు. 55

తా॥ కాకి వర్ణము నలుపు. అట్లే కోయిల రూపమును నలుపే. ఆకారమును, రంగునుబట్టి వాని భేదమును గమనింపజాలము. కాని వసన్తఋతువు రాగానే వాని కూతఁనుబట్టి అవి వేర్వేరుగ గుర్తింప నగును.

సం॥ కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః,
వసన్తసమయే ప్రాప్తే కాకః కాకః పికః పికః.

ఆ. వె. అరయ సౌఖ్య మేది? ప్రాణి కారోగ్యంబె
స్నేహ మేది? [1]భావనిర్మలతయె
[2]పాండితి యన నేది? [3]వరవిషయ విభక్తి
ధర్మ మేది? భూతదయయె సుమ్ము. 56

తా॥ (1)లోకమున పరిశీలింప సౌఖ్యమన నేది? ప్రాణులకు మంచి ఆరోగ్యమే సౌఖ్యమగును. అనగా సౌఖ్యదాయకమైనది. (2) స్నేహమన నేది? భావమందు దోషము లేకుండుటయే. అనగా నిర్మలమగు భావమే స్నేహము. (3) పాండిత్యమన నేది? చక్కగా విషయమును విభజించి వివరించగల్గుశక్తియే. (4) ధర్మమన నేది? సర్వ జీవులయందు దయఁ జూపుటయే.

సం॥ కో ధర్మః? భూతదయా. కిం సౌఖ్యం? ఆరోగితా జగతి జన్తోః,
కః స్నేహః? సద్భావః, కిం పాండిత్యం? పరిచ్ఛేదః.

---

55-1. కోయిల 2. తెలిసికొనలేము 3. కూఁత 56-1. భావము నిర్మలముగా నుండుటయే 2. పాండిత్యము 3. స్పష్టమగు విషయ విభజనశక్తి.

ఆ. వె. అలరు సాధుజనులె ఆపన్నులై యుండ
సుజను లుద్ధరింపఁ [1]జోద్య మేమి?
బురదఁ జిక్కు [2]కరినిఁ బ్రోచుట కరయంగ
కరులె చాలియుంటఁ గనుము జగతి. 57

తా॥ ఆపదలకు గురియైన సజ్జనులను లేక గొప్పవారిని సజ్జనులు లేక గొప్పవారు మాత్రమే ఉద్ధరింపగలరు. ఎట్లన:- బురదలో చిక్కుకొనిన ఏనుఁగులను రక్షింప ఏనుఁగులే సమర్థము లగును.

సం॥ సన్త ఏవ సతాం నిత్యం ఆపదుద్ధరణక్షమాః,
గజానాం పంకమగ్నానాం గజా ఏవ ధురంధరాః.

ఆ. వె. [1]గుణవిహీనజనులఁ గోరి చేరును లక్ష్మి
[2]వంశహీనజనుల [3]వాణి వలఁచు
[4]పాత్రహీనజనుల [5]భామ [6]వాంఛించును.
[7]అద్రు లందె కురియు [8]నంబుదంబు. 58

తా॥ లోకములో లక్ష్మి మంచిగుణములు తక్కువగానుండు జనుల వద్దకు చేరును. సరస్వతి హీనవంశములో బుట్టినవారిని వరించును. వనిత యోగ్యతలేని వారిని వలఁచును. మేఘము కొండలయందు ఎక్కువగా వర్షించును. ఈ విషయములందు యోగ్యతకంటె అయోగ్యతకే ప్రాధాన్య మున్నట్లు గోచరించుచున్నది. ఇది లోకానుభవమే ప్రమాణము కాఁదగి యున్నది.

సం॥ లక్ష్మీ ర్లక్షణహీనేషు కులహీనే సరస్వతీ,
కుపాత్రే రమతే నారీ, గిరౌ వర్షతి మాధవః.

---

57-1. ఆశ్చర్యము 2 ఏనుఁగును. 58-1. సద్గుణములులేని జనులను 2. సద్వంశమున బుట్టని వారిని 3. సరస్వతి 4. యోగ్యతలేని 5. స్త్రీ 6. కోరును 7. కొండలందె 8. మేఘము.

ఆ. వె. జనుల [1]మానసంబు [2]చంచలంబౌ, నదె
బలము, [3]దార్ఢ్య మొంది బాధఁ గూర్చు
మనసు [4]నిగ్రహంబు జనుల కశక్య మౌ
[5]పవన నిగ్రహంబు పగిది చూడ. 59

తా॥ మనుజుల మనస్సు చంచలమైనది (నిలకడ లేనిది) గా నుండును అది మంచి బలము కలిగి దృఢమై జనుల నెప్పుడును వేధించుచుండును వాయువుయొక్క నిగ్రహమువలెనె మనస్సును నిగ్రహించుటయు సర్వజనులకు శక్యముగాదు.

సం॥ చంచలం హి మనః కృష్ణ! ప్రమాది బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే, వాయోరివ సుదుష్కరమ్.

ఆ. వె. పశువు లెల్ల సాగు [1]పరిమళమును బట్టి
బుధులు నడచు [2]శ్రుతుల పథము బట్టి
[3]విభులు నరయు చంద్రు [4]వేగుల వలనను
ఇతరు లెఱుఁగుచుందు [5]రీక్షణముల. 60

తా॥ పశువులన్నియు వాసనను బట్టి ముందుకు సాగిపోవుచుండును. పండితులు వేదోక్త మార్గమునుబట్టి నడచుకొందురు. రాజులు గూఢచారుల మూలమున విశేషముల దెలిసికొని వ్యవహరింతురు. ఇతర జనులు తాము చూచి తెలిసికొందురు.

సం॥ జానన్తి పశవో గంధాత్ వేదాజ్జానన్తి పండితాః,
చారాజ్జానన్తి రాజానః చక్షుర్భ్యా మితరే జనాః.

---

59-1. మనస్సు 2. నిలుకడలేనిది 3. గట్టితనము 4. అదుపులో నుంచుట 5. వాయువును నిగ్రహించుటవలె. 60-1. వాసనను 2. వేదోక్త మార్గము 3. రాజులు 4. గూఢచారులు 5. కనులతో.

తే॥గీ॥ [1]భుక్తి-సంభాషణములందుఁ [2]బ్రూన్కితోడ
జనులు [3]జిహ్వ ప్రమాణంబుఁ గనఁగవలయు
[4]ఉక్తి-భుక్తులు మితముగ నొప్పకున్న
అవియ [5]ప్రాణాపహారులౌ టరయ వలయు. 61

తా॥ భుజించుటయందును, మాట్లాడుటయందును జనులు ప్రయత్నించి నాలుకకు తగు పరిమితి యున్నదని గుర్తింపవలెను. ఉక్తి (మాట), భుక్తి (భోజనము) అను నీ రెండును మితిని మీరినచో అవియే ప్రాణముల హరించునని గమనింపవలెను.

సం॥ జిహ్వే ప్రమాణం జానీహి భోజనే భాషణేఽపి చ,
అతిభుక్తి రతీవోక్తి: సద్య: ప్రాణాపహారిణీ.

తే॥గీ॥ భూమి [1]వీరవిజిత మయ్యు శోభఁగుచుండు
రాజసభ [2]వేష విజితమై [3]రక్తిఁ గాంచు
ఆదరోక్తుల [4]విజితుఁ [5]డభ్యాగతుండు
అమిత కృషిచేత దారిద్ర్య మంత మొందు. 62

తా॥ భూమి వీరులచే జయింపబడి శోభించుచుండును. రాజ సభా ప్రవేశము వేషములనుబట్టి జరుగును. భోజనముచేయు వేళకు వచ్చిన అతిథి ఆదర వచనములచే వశుఁడగును. మంచి కృషిచేత దారిద్ర్యము నశించును. (ఇట మొదటి పాదభావము మార్చి వ్రాయబడినది)

సం॥ జితా ధనవతా దారా:, జితా వస్త్రవతా సభా,
జితోఽహ్యభ్యాగతో గోభి ర్దారిద్ర్యం కృషిభిర్జితమ్:

---

61-1. భోజనము 2. ప్రయత్నముతో 3. నాలుకకుండు పరిమితి 4. మాట 5. ప్రాణములను పోగొట్టునవి. 62-1. వీరులచే జయింపబడినది 2. దుస్తులధారణముచే జయింపబడినది 3 కళకళ లాడును 4. జయింపబడినవాఁడు 6 భోజనముచేయు వేళకు వచ్చినవాఁడు 6. వ్యవసాయముచే, యత్నముచే.

ఆ. వె. పుట్టు ప్రాణి ధరణిఁ [1]గిట్టు నొక్కదినాన
మరణమందు జీవి మఱలఁ బుట్టు,
అడ్డదరముగాక ఆ [2]సిరుల్ నశియింప
[3]విజ్ఞులు [4]వ్యథపడ వివేక మగునె? 63

తా॥ ఈ లోకములో పుట్టిన ప్రతిజీవి మరణించును. మరణించిన ప్రాణి తిరిగి పుట్టుననియు నందురు. కావున అడ్డుకొనశక్యముగాక సంపదలు నశించునపుడు వానికై విద్వాంసులు దుఃఖించుట వివేకము కాఁజాలదు. (ఇది కృష్ణుఁడు అర్జునునితో నన్నమాట).

సం॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

ఆ. వె. భోజనాంతమందుఁ బూనిక్కఁ [1]బేయం బేది?
పరజయుంతుఁ డెవరి [2]పట్టి యగును?
[3]విష్ణుపద మ దెట్లు [5]కథిత మగును?
[6]తొడకు చల్ల [7]వజ్రి దుర్లభంబు. 64

తా॥ (1) భోజనము చివరఁ ద్రాగఁదగినదేది? (2) పరికింప జయంతుఁ డెవనిబిడ్డ? (3) విష్ణుపద మెట్టిదిగా చెప్పఁబడుచుండును? పై మూఁడు ప్రశ్నలకు వరుసగా 1. మజ్జిగ 2. ఇంద్రునకు 3. పొందశక్యముగానిది అనునవి సమాధానము లగును.

సం॥ భోజనాన్తే చ కిం పేయమ్? జయన్తః కస్య వై సుతః,
కథం విష్ణుపదం ప్రోక్తం? తక్రం, శక్రస్య, దుర్లభమ్.

---

63-1. చచ్చును 2. సంపదలు 3. విద్వాంసులు. 64-1. త్రాగఁదగినది 2. బిడ్డ 3. వైకుంఠము 4. ప్రకాశించును 5. చెప్పఁబడినది 6. గోపు 7. ఇంద్రుఁడు.

ఆ. వె. [1]పాలు త్రాగు టనఁగఁ బడయరాని దగును
దధి యని కలనయినఁ దలఁపరాదు
[2]ఘృతము నాను మాట [3]శ్రుతులఁ బడునె మాకు
శక్ర దుర్లభంబు తక్ర మెన్న. 65

తా॥ పాలు త్రాగుట అనునది పొందరాని విషయమే దధి సంగతి కలలోనైన తలంపఁ గూడనిదే. ఘృతము (నేయి) నాస్వాదించు మాట చెవినైనఁబడదు. మజ్జిగందువా? అది దేవేంద్రునకైనను దుర్లభమే.

సం॥ ఘృతం న శ్రూయతే కర్ణే, దధి స్వప్నేఽపి దుర్లభమ్,
ముగ్ధే! దుగ్ధస్య కా వార్తా? తక్రం శక్రస్య దుర్లభమ్.

ఆ. వె. [1]నారి గర్వ మంది నాశ మందు జగతి
తపము [2]కినుక మీఱఁ తనర దయ్యె
ఆవు [3]దూరగతిచె ఆయాస మందును
[4]హరిణి [5]లోభవిప్స [6]హానిఁ జెందు. 66

తా॥ వనిత గర్వించినయెడల వినాశమగును. కోప మధికమైనచో తపస్సు శోభింపదు. ఆవు బహుదూర గమనము (నడక) చే అలసట చెందును. ఆడులేడి కోరిక నెఱవేర్చుకొనగోరి కీడును బొందును.

సం॥ స్త్రీ వినశ్యతి గర్వేణ తపః క్రోధేన నశ్యతి,
గావో దూరప్రసారేణ హరిణీ లోభవిప్సయా

---

65-1. పొందరానిది 2. నేతిని ఆస్వాదించు 3. చెవులందు.

66-1. స్త్రీ 2. కోపము 3. బహుదూరము వెళ్ళుటచే 4. ఆడులేడి 5 కోరికఁ దీర్చుకొనుటలో.

ఆ. వె. మహీ మహాత్మ్య 1మహిమ మాయు మగును జూడ
2దేవురించి పరుని 3"దేహి" యనఁగ
ఆ 4సిరిపతి బలిని యాచింప 5నరుదెంచి
6వామనుండు నయ్యు 7భంగపడఁడె? 67

తా॥ దరిద్రుఁడై ఇతరులను "దేహి" అని అడుగకుండు నంతవరకే మహాత్ముల మహిమ స్థిరముగా నుండును. "దేహి" అని యాచించినంతనే వారి మహిమ నశించిపోవును. సాక్షాత్తు లక్ష్మికి భర్తయౌ నారాయణుఁడే బలిచక్రవర్తిని యాచింపవెళ్లి వామనరూపమంది భంగపడలేదా? భంగపడి నాఁడని భావము

సం॥ తావన్మహతాం మహతీ యావత్కిమపి హి న యాచతే లోకమ్,
బలి మనుయాచన సమయే శ్రీపతి రపి వామనో జాతః.

ఆ. వె. వెళ్లి చూచు నెవఁడు పెక్కు 1విదేశముల్
పూని చేయు నెవఁడు బుధుల సేవ.
వాని బుద్ధి 2విరిసి 3వఱలుచుండు 4సతము
నీట నూనెబొట్టు 5నెగడురీతి. 68

తా॥ బహు విదేశములకు వెళ్లి చూచువాఁడును, బహుపండితుల సేవ చేయువాఁడును బుద్ధివికాసముచే ప్రకాశించుచుండును. నీటిలో నూనె బొట్టు పడినతో అది మిక్కిలి విస్తరించుట అనుభవసిద్ధమే కదా! అటులనే బహుదేశ సంచారియు, పండితుల సేవించువాడు నగు నరుని బుద్ధి విస్తరించును.

సం॥ యోస్తు సంచరతే దేశాన్ యస్తు సేవేత పండితాన్,
తస్య విస్తారితా బుద్ధిస్తైలబిందురివాంభసి.

---

67-1. గొప్పతనము 2 దైన్యము (దారిద్ర్యము)ను పొంది 3. ఇమ్ము 4 విష్ణువు 5. వచ్చి 6. పొట్టివాడు (వామనావతారము) 7. అవమాన పడ లేదా? 68-1. ఇతరదేశములు 2. వికసించి, విప్పారి 3. ప్రకాశించు 4. ఎల్లప్పుడు 5. వృద్ధిచెందు (ఇట వ్యాపించు).

ఆ. వె. [1]కోమలాంగి మనసు, గోవింద కోపంబు,
2వాజిగతియు, బురుషభాగ్య మరయ
[3]వఱపు [4]నధికవృష్టి, ప్రాణిమృతియు 5దివ్యు
లెఱుఁగ లేరన నరు లెఱుఁగఁ గలరె: 69

తా॥ స్త్రీ యొక్క అభిప్రాయము, గోవిందుని కోపము, గుఱ్ఱపు గమనరీతియు, మనుజుని భాగ్యమును, అనావృష్టిని, అధికవృష్టిని, ప్రాణుల ప్రాణము పోకడను ఆ దేవతలే ఎరుఁగజాలరన మానవులెరుఁగఁ గలరా? ఎరుఁగలేరని భావము.

సం॥ అశ్వప్లుతం మాధవగర్జితం చ స్త్రీణాం చ చిత్తం పురుషస్య భాగ్యమ్,
అవర్షణం చాప్యతివర్షణం చ దేవో న జానాతి కుతో మనుష్యః.

తే॥గీ॥ తండ్రి రత్నాకరుండయి తనరుచుండు
1పద్మ యతని తోబుట్టువై పరఁగుచుండు
అట్టి శంఖంబు భిక్షంబు బట్టుచుండు
[2]భాగ్యమును బట్టి ఫలితంబుఁ బడయ నగును. 70

తా శంఖమునకు జన్మస్థానమగు సాగరుండు రత్నాకరుఁడే (రత్నములకు నిలయుఁడె). పద్మ (లక్ష్మి) ఆ శంఖమునకు తోడబుట్టువే. అయిన నేమి? శంఖము భిక్షమును పట్టుచుండును. కావున వారి వారి అదృష్టమునుబట్టి ఫలితము కలుగుచుండునని స్పష్టమగుచున్నది.

సం॥ పితా రత్నాకరో యస్య లక్ష్మీర్యస్య సహోదరీ,
శంఖో భిక్షాటనం కుర్యాత్ నాదత్త ముపతిష్ఠతే.

---

69-1. స్త్రీ మనస్సు 2 గుఱ్ఱపు నడక 3. వానలేమి 4. అధిక వర్షము 5. దేవతలు. 70-1. లక్ష్మి 2. అదృష్టము.

ఆ. వె. విద్య, [1]పౌరుషంబు [2]వెలయు ఫలము లీవు
[3]సుర [4]లసురులు [5]బడలి [6]చొక్కుచుండ
[7]సిరి-[8]విసములఁగాంచి హరిహరుల్ [9]కవియరే?
ఒక్క [10]దైవ మిచ్చు నుచితఫలము. 71

తా॥ చదువుగాని పురుష ప్రయత్నముగాని సత్ఫలముల నీయ జాలవు. దేవతలు, రాక్షసులు కష్టపడి పాలకడలిని (క్షీరసాగరమును) చిలుకగా ఆ కడలినుండి లభించిన లక్ష్మినై హరియు, విషమునకై హరుఁడును గ్రమ్ముకొనిరి. కావున ఫలము నిచ్చునది ఆ దైవమేగాని అన్యముకాదు.

సం॥ దైవం ఫలతి సర్వత్ర న విద్యా న చ పౌరుషమ్,
సముద్రమథనా ల్లేభే హరిర్లక్ష్మీం హరో విషమ్.

ఆ. వె. [1]అర్థి యాచనముల నరసి తీర్చు నెవఁడు?
అన్యు నెన్నఁ డేది యడుగఁ డెవఁడు?
అట్టి పుణ్యపురుషు లవనియం దెన్నడున్
పుట్టి యుండ లేదు, పుట్టబోరు. 72

తా॥ ఏ నరుఁడు యాచకు లందరి కోర్కెలను దీర్చునో, ఎవఁడు పరులను ఎన్నడేదియు నర్థింపఁడో అట్టి పావనజను లీ ధరలో మునుపు పుట్టలేదు. ఇక ముందు పుట్టబోరు.

సం॥ ద్వావిమౌ పురుషౌ లోకే న భూతౌ న భవిష్యతః,
ప్రార్థితం యశ్చ కురుతే యశ్చ న ప్రార్థయతే పరమ్.

---

71-1. పురుషప్రయత్నము 2. శోభించు 3. దేవతలు 4. రాక్షసులు 5. శ్రమపడి 6. పరవశమగు 7. లక్ష్మి 8. విషము 9. గ్రమ్ము 10. విధి.
72-1. యాచకుల కోరికలను.

ఆ. వె. విషము విషమె కాదు [1]వెలయఁ బరీక్షింప
[2]బ్రహ్మ విత్త మగును పరమ విషము
[3]ఒడల విషమ దింక ఒక్క దేహమె [4]తీఱు
బ్రహ్మ ధనము [5]దీర్చు పలుతరాల. 73

తా॥ పరికించి చూడ విషమును విషమనుట తగదు. బ్రహ్మవిత్తమే విష మనఁదగును. శరీరమందు విష మింకినచో ఒక్క దేహమే నశించును, బ్రహ్మధనమను విషము దేహమున ఇంకినచో తాను, పుత్రులు, పౌత్రులు కూడ నశింతురు.

సం॥ న విషం విష మిత్యాహుః బ్రహ్మస్వం విష ముచ్యతే,
విష మేకాకినం హన్తి బ్రహ్మస్వం పుత్రపౌత్రకమ్.

ఆ. వె. [1]ఖలజనహృదయంబ [2]దలరు బోధలచేత
సహజ [3]కుటిల [4]ముడిగి సరళ మగునె?
వంకఁ దీర్పఁగోరి బంధింప కఱ్ఱకున్
కుటిల ముడుగఁ గలదె కుక్కతోక? 74

తా॥ ఎంత చక్కగా బోధించినను దుష్టుల హృదయము కుటిలత్వమును (వంకరను) విడిచి సరళతను (తిన్నదనమును) పొందదు. ఎట్లన:- కఱ్ఱకుఁ గట్టినైన కుక్కతోకను తిన్నగా చేయుటకు ఎంత ప్రయత్నించినను అది తన వక్రతను (వంకరదశను) విడువదుగదా!

సం॥ నలికాగతమపి కుటిలం న భవతి సరళం శునః పుచ్ఛమ్,
తద్వత్ ఖలజనహృదయం బోధితమపి నైవ యాతి మాధుర్యమ్.

---

73-1. స్పష్టముగా 2. బ్రహ్మజ్ఞాని ధనము 3. శరీరమున 4. నశించు 5. నశింపజేయు. 74-1. దుష్టుల హృదయము 2. ఒప్పెడు 3. వంకరతనమును 4. విడిచి.

ఆ. వె. [1]ధర్మసార మంతఁ [2]దసరంగఁ జెప్పద
దాని మనసునందుఁ దాల్పు [3]మనఘ!
తనకు ప్రియము కాని దానిఁ [4]పెఱకుఁజేయ
తలఁప కుండుటె పరధర్మ మగును. 75

తా॥ ఓ యనఘా! ధర్మములలోకెల్ల శ్రేష్ఠము, సారమునైన ధర్మ మొకటి కలదు. ఆ ధర్మమును చెప్పెదను. శ్రద్ధగా విని, మనసునందు నిల్పి దాని నాచరింపుము. ఆ ధర్మమేది యన-తనకు ఇష్టము (ప్రియము) కాని అనగా నచ్చని లేక బాధాకరమైన పనిని- ఇతరులకు నది అట్టిదే కావచ్చును. గాన-తానుచేయ తలపెట్టకుండుటయే గొప్పధర్మము.

సం॥ శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వా చైవావధార్యతామ్,
ఆత్మన: ప్రతికూలాని పరేషాం న సమాచరేత్.

ఆ. వె. బురద లేని యట్టి సరసెంతొ శోభించు
[1]ఖలులు లేని సభయుఁ గాంచు శోభ
కఠిన [2]వర్ణ హీన కావ్యంబు శోభించు
[3]విషయ విరతమనసు వెలయు నెంతొ. 76

తా॥ బురద లేని సరస్సులు మనోహరముగా నుండును. అటులనే దుర్జనులు లేని సభయు, విన నింపుగాని అక్షరములు లేని కావ్యమును, విషయ సుఖములు విడిచిన మనస్సును ఎంతగనో శోభించును.

సం॥ పంకైర్వినా సరో భాతి, సభా ఖలజనైర్వినా,
కటువర్ణైర్వినా కావ్యం మానసం విషయైర్వినా.

---

75-1. ధర్మములోని సారాంశము 2. ఒప్పునట్లుగ 3. పాపములులేనివాఁడా! 4. ఇతరులకు. 76—1. దుర్జనులు 2. అక్షరములులేని 3. విషయ సుఖములనుండి విరమించిన మనసు.

ఆ. వె. ముడుత లతిశయించె ముఖ మంతఁ [1]బరికింప
[2]నరసి పోయె నెంతొ శిరముఁ గాంచ
[3]సడలు చుండె [4]గాత్ర సంధి బంధము లన్ని
తనరు [5]తృష్ణ యొకటె [6]తరుణ మయ్యె. 77

తా॥ జనులకు ముదిమి (ముసలతనము) రాగా ముఖమున ముడుతలు పడును. తల అంతయు ముగ్గుబుట్టవలె నరయుచుండును. శరీరమునందలి సంధిబంధములు (కీళ్ళు) పట్టుదప్పుచుండును. ఈ రీతిగా శరీరము బలముడిగినట్లు ఉన్నను ఆశ యొక్కటిమాత్రమే వదలక ప్రబలమై జనులను పీడించుచుండును.

సం॥ పలిభిర్ముఖ మాక్రాంతం పలితై రంకితం శిరః,
గాత్రాణి శిథిలాయన్తే తృష్ణైకా తరుణాయతే.

ఆ. వె. మానవాళి కెల్ల [1]మాన్య సంపాద్యమే?
దిల [2]చదువు, సుకృతము, బలము [3]యశము
గుణ [4]వినాశి దుష్టగుణ మేది? [5]లోభమౌ.
కనఁగ శత్రు వెవఁడు? [6]కాముఁ డౌను. 78

తా॥ (1) మనుజు లెల్లరకు పూజ్యములు, సంపాద్యములు (సంపాదింపదగినవి) ఏవి? 1) విద్య, 2) పుణ్యము 3) బలము 4) కీర్తి. ఇవి కొనియాడదగినవి. తప్పక అందరు సంపాదింపదగినవి. (2) మంచిగుణములను పాడుచేయు చెడ్డగుణమేది? లోభ మట్టిదే. (3) శత్రు వెవఁడు? మన్మథుఁడే శత్రువౌను.

సం॥ కిం సంపాద్యం మనుజైః? విద్యా వి త్తం బలం యశః పుణ్యమ్,
కః సర్వగుణ వినాశీ? లోభః. శత్రుశ్చకః? కామః.

---

77-1. పరీక్షింప 2: ముసలితనముచే వెంట్రుకలు తెల్లబడు 3. పట్టుదప్పు 4. శరీరములోని కీళ్ళు 5. ఆశ 6. యౌవనము (బలము)గలది, క్రొత్తది.
78-1. మాననీయము, సంపాదింపదగినది 2. పుణ్యము 3. కీర్తి 4. నాశము చేయునట్టి 5. పిసినితనము 6. మన్మథుడు.

ఆ. వె. సారహీనమైన సంసార మందున
1శ్వశుర మందిరంబె సార మగును.
2గిరిశుఁడు శయనించె 3గిరిరాజ శిఖరాన
4శౌరి 5పవ్వళించె సాగరమున. 81

తా॥ సంసారము సారములేనిదనుట నిజమన్నను, ఇందు సారమన దగినది మామగారిల్లొకటే! అందుచేతనే శ్వశురగృహవాసము స్వర్గతుల్య మని చెప్పబడినది. కావుననే శివుఁడు మామయగు హిమవత్పర్వత శిఖర మునను అనగా కైలాసమునను, విష్ణువు లక్ష్మికి జన్మస్థానమగు సాగరమం దును నివసించుచున్నారు.

సం॥ అపారే ఖలు సంసారే సారం శ్వశురమందిరమ్,
హిమాలయే హరశ్శేతే హరిశ్శేతే మహోదధౌ.

ఆ. వె. తనరు జగము దంత దైవవశమె సుమ్ము
సకలదేవుఁ డరయ సత్యవశుఁడె
ఒప్పుచుండు సత్య 1ముత్తమాధీనమై
ఒవరు దేవుఁడనఁగ నుత్తముండె. 82

తా॥ లోకమంతయు దైవాధీనమై యుండును. సకలాధీశుఁడగు నా దేవుఁడు సత్యమునకు వశుఁడై యుండును. ఆ సత్యము ఉత్తమ జనుల కధీనమై యుండును. కావున అట్టి ఉత్తముఁడే నాకు దేవుఁడు.

సం॥ దైవాధీనం జగత్సర్వం సత్యాధీనం తు దైవతమ్,
తత్సత్య ముత్త మాధీన ముత్తమో మమ దేవతా.

---

81-1. మామగారిల్లే 2. ఈశ్వరుఁడు 3. కొండలరాజగు హిమవంతుని శిఖరమందు 4. విష్ణువు 5. పరుండెను. 82-1. ఉత్తమ జనునకు వశమై.

ఆ. వె. [1]పరమధర్మ మయ్యు పరఁగుచుండు [2]నహింస
[3]పరమతపము నయ్యు [4]ప్రథిత మదియె
పరమ సత్య మనఁగ ప్రకట మయ్యె నహింస
[4]దాన [5]ధర్మవృత్తి తనరుచుండు. 79

తా॥ ఏ ప్రాణిని హింసింపకుండుటయే అహింస యనబడును. ఆ యహింసయే పరమధర్మము. పరమతపము పరమసత్యమును. ఈ యహింసను మించిన ధర్మముగాని, తపస్సుగాని, సత్యముగాని లేనేలేదు. దీనివలననే ధర్మము లోకమున ప్రవర్తిల్లుచుండును.

సం॥ అహింసా పరమో ధర్మః, అహింసా పరమం తపః,
అహింసా పరమం సత్యం యతో ధర్మః ప్రవర్తతే.

ఆ. వె. [1]స్వోపకారి [2]కరసి యుపకారమును జేయు
గొప్పగుణ మది యని చెప్పఁ దగదు.
[3]స్వాపకారులకును సాయంబు చేయంగ
[4]ఉరుగుణ మది యండ్రు పరమమతులు. 80

తా॥ తన కుపకారము చేసినవారికి తిరిగి ఉపకారము చేయుట గొప్ప సుగుణమని చెప్పదగదు. తన కపకారము చేసినవారి కుపకారము చేయుటయే గొప్పగుణమని పెద్దలండ్రు.

సం॥ ఉపకారిషు యః సాధుః సాధుత్వే తస్య కో గుణః,
అపకారిషు యః సాధుః స సాధుః సద్భి రుచ్యతే.

---

79-1. గొప్పధర్మము 2. హింసింపకుండుట 3. గొప్ప తపస్సు 4 ప్రసిద్ధము 5. దానివలన 6. ధర్మప్రవృత్తి. 80-1. తనకు తోడ్పడిన వానికి 2. వెదకి (చూచి) 3. తనకు కీడుచేసినవానికి 4. గొప్పగుణము.

ఆ. వె. సంపద లవి యెల్ల స్వగృహమందె నిలుచు
[1]సఖులు బంధులున్ శ్మశానమందె
[2]సుకృత-దుష్కృతములె [3]సుమ్ము [4]వశ్యంబుగా
ఆత్మ ననుసరించు నంద్రు బుధులు. 83

తా॥ జనులు సంపాదించు సంపదలు ఇంటిలోను, మిత్రులు బంధువులును కాటివద్దను నిలిచిపోగా మృతనరుని వెంట తాను చేసికొనిన పుణ్య పాపములు మాత్రమే బోవునని పండితు లందురు.

సం॥ అర్థా గృహే నివర్తన్తే శ్మశానే మిత్రబాంధవాః,
సుకృతం దుష్కృతం చైవ గచ్ఛన్త మనుగచ్ఛతి.

ఆ. వె. అమరు విద్య నరున కభ్యాసమును బట్టి
అలరు బుద్ధి కర్మ ననుసరించి
చేరు లక్ష్మి నరుని స్వీయకృషిని బట్టి
తనరు ఫలము భాగ్య మనుసరించి. 84

తా॥ లోకమందు విద్యార్థికి వాని అభ్యాసబలము ననుసరించి విద్య వచ్చును. పూర్వజన్మమందు చేసిన కర్మననుసరించి మనుజులకు బుద్ధి వికాసము కలుగును. సామాన్యముగా నరులు చేసెడు కృషికి తగినట్లు లక్ష్మి లభించును. మొత్తముమీద నరుని అదృష్టము ననుసరించి వానికి ఫలితము కలుగుచుండును. శ్రద్ధచూపి, మనసు నిలిపి చదువనిదే చదువు రాదు. కొందరికి బుద్ధివికాసము సులభముగ కలుగును. కొందరికి అట్లు కలుగదు. అట్లే దున్నకుండ నాట కోయకుండ పండెనను లోకోక్తియు, కృషిలో లోపమ కన్పింపకున్నను ఫలము కలుగుటలో భేదముండుట యను లోకానుభవము మున్నగు నంశములిట జ్ఞాపకము చేసికొనదగి యున్నవి.

83-1. మిత్రులు 2. పుణ్య-పాపములు 3. సుమా (చూడుమా) 4. తప్పక.

సం॥ అభ్యాసానుసారీ విద్యా, బుద్ధి: కర్మానుసారిణీ,
ఉద్యోగానుసారీ లక్ష్మీః, ఫలం భాగ్యానుసారిణీ.

ఆ. వె. [1]విహగజాతిబలము [2]విస్తృతాకాశంబె
[3]మత్స్యజాతిబలము [4]మహితజలమె.
బలములేని జనుల బలము [5]ప్రభువరుండె
కాదె శిశుబలంబు [6]రోదనంబు? 85

తా॥ పక్షులకెల్ల విశాలమగు ఆకాశమే బలము. చేపలకు లోతునీరె బలము. దుర్బలులకు రాజే బలము. శిశువులకు ఏడ్పే బలము. అనగా పక్షులకు స్వేచ్ఛ లేకుండ పంజరాదులందు బంధించుటగాని, చేపలకు నీటి నుండి తీసి బయటనుంచుటగాని, బలహీనులకు రాజులు లేకుండుటగాని బలవర్ధకములుకావు. అట్లే పసిబిడ్డలకు ఏడ్పే బలకరము అని గ్రహింప దగును.

సం॥ పక్షిణాం బలమాకాశం, మత్స్యానా ముదకం బలమ్,
దుర్బలస్య బలం రాజా, బాలానాం రోదనం బలమ్.

ఆ. వె. దాన [1]మీని నరుఁడు దారిద్ర్యమున్ బొందు
అల దరిద్రమనుజుఁ [2]డఘము సేయు
అరయఁ [3]పాతకుండు నరకంబు చేరును
మహి దరిద్రుఁ డగును. మఱల పాపి. 86

తా॥ పూర్వజన్మలో దానము చేయనందువలన ఈ జన్మలో దరిద్రుఁ డగును దరిద్రుఁడైనవాఁడు బాధపడుచు పెక్కుచెడ్డ కార్యములు చేయును. అట్లు పాపముచేసిన వానికి నరకము లభించును. అ విధముగా నరకమనుభవించి మఱల దరిద్రుఁడుగా పుట్టును. కావున ఉన్నంతలో దానముచేసి పుణ్యము సంపాదింపవలెను.

---

85-1. పక్షిజాతి 2. విపులమగు ఆకాశమే 3. చేపజాతి 4 గొప్ప (లోతైన) నీరు 5. రాజశ్రేష్ఠుఁడు 6. ఏడ్పే. 86-1 ఈయని 2. పాపము 3. పాపాత్ముఁడు.

సం॥ అదానదోషేణ భవేద్దరిద్రో, దారిద్ర్యదోషేణ కరోతి పాపమ్,
పాపా దవశ్యం నరకం ప్రయాతి పునర్దరిద్రః, పునరేవ పాపీ.

ఆ. వె. అవని జీవనం బ దస్థిరం బౌ చూడ
యౌవనంబు, ధనము నస్థిరములు
అరయు [1]దారపుత్రు లస్థిరులే గదా!
ధర్మకీర్తు [2]లెన్న [3]దనరు స్థిరత. 87

తా॥ లోకములో మానవజీవితముగాని, జనుల యౌవనముగాని, ధనముగాని అస్థిరములు. తుదకు భార్యాపుత్రులైనను స్థిరత లేనివారే. స్థిరమైనవి ధర్మము, కీర్తి మాత్రమే. కాన జనులు అస్థిరములపై ఆసక్తిని విడిచి స్థిరములపై దృష్టి నిలుపవలెనని తాత్పర్యము.

సం॥ అస్థిరం జీవనం లోకే, అస్థిరం యౌవనం ధనమ్,
అస్థిరం దారపుత్రాది, ధర్మః కీర్తిర్ద్వయం స్థిరమ్.

తే. గి. [1]అరుదె బంధువున్ గురుఁడు [2]నర్థాతురులకు
అరుదె లజ్జయున్ భయము [3]కామాతురులకు
అరుదె సౌఖ్యంబు నిద్ర [4]విద్యాతురులకు
అరుదె రుచియు [5]పక్వతయు [6]క్షుధాతురులకు. 88

తా॥ అన్నిటికంటె ధనమందే ఆసక్తికలవారు పుణ్య-పాపములనిగాని, గురుజనులు, బంధువులనిగాని చూడక మోసపుచ్చి ధనమునే ఆర్జింపజూతురు. అట్లే కామమందే ఆసక్తికలవారు తామొనర్చు పనికి సిగ్గుపడరు. అట్లే విద్యయందే ఆసక్తికలవారు సుఖమునుగాని, నిద్రనుగాని లెక్కింపరు. అటులనే ఆకలిమంటలకు లోనగువాడు దొరకిన పదార్థము ఉడికినదో లేదో, రుచిగనున్నదో లేదో అని ఆలోచింపడు. "కాలేకడుపుకు మాడే గంజి"అను లోకోక్తి ఇట్టివారియెడ సార్థకము గదా!

---

87-1. భార్యయు. బిడ్డలును 2. లెక్కింప (పరిశీలింపగా) 3 స్థిరతచే నొప్పునవి. 88-1. పూర్వము జరుగని విషయము 2. ధనాసక్తునకు 3. కామమందాసక్తి కలవారికి 4. విద్యయందాసక్తి కలవారికి 5. ఉడుకుట 6. ఆకలిగొన్నవారికి.

సం॥ అర్థాతురాణాం న గురుర్న బంధుః, కామాతురాణాం న భయం న లజ్జా,
విద్యాతురాణాం న సుఖం న నిద్రా, క్షుధాతురాణాం న రుచిర్న పక్వమ్,

ఆ. వె. జగతిఁ దల్లి యనఁగ [1]సర్వతీర్థమయమె
[2]దివ్య పితయె సర్వదేవమయుఁడు.
కొటఁ దల్లి దండ్రు లాత్మసుతుల కెల్ల
ప్రథమపూజ్యు లనుట [3]ప్రథిత మయ్యె. 89

తా॥ ఈ లోకమందు తల్లి యనఁగా సమస్త తీర్థస్వరూపము. తండ్రియన అఖిలదేవ స్వరూపుఁడె. కాబట్టి సుతుల కందరికిని, ముందుముందుగా సేవింపదగిన తీర్థము, పూజింపతగిన దేవతలును తల్లిదండ్రులే. కావున తల్లిదండ్రులను ప్రత్యక్షదేవతలన్నారు.

సం॥ సర్వతీర్థమయీ మాతా, సర్వదేవమయః పితా,
మాతరం పితరం తస్మాత్సర్వ యత్నేన పూజయేత్.

ఆ. వె. [1]అలసమానవులకు [2]నబ్బదెపుడు విద్య
చదువు లేక ధన [3]మసాధ్య మగును.
అర్థహీనున కిల [4]నాప్తమిత్రుఁడె లేఁడు.
సుఖము పొంద నగునె సఖుఁడు లేక 90

తా॥ అలసులు (సోమరులు) అగు జనులకు చదువు రాదు. చదువు రానివాడు ధన మార్జింపలేఁడు. ధనము లేనివానికి మంచిమిత్రుఁడే ఉండడు. మిత్రుఁడే లేకున్న జీవితములో సుఖమే ఉండదు. ఆ స్థితిలో జీవించుటయే వ్యర్థము.

సం॥ అలసస్య కుతో విద్యా, అవిద్యస్య కుతో ధనమ్,
అధనస్య కుతో మిత్రం అమిత్రస్య కుతః సుఖమ్.

---

89-1. అన్ని పుణ్యక్షేత్రములతో కూడినది 2. శ్రేష్ఠమైన 3. ప్రసిద్ధము.
90-1. సోమరులకు 2. అలవడదు 3. కూర్పశక్యముగానిది 4. మేలుగోరు స్నేహితుడు.

ఆ. వె. భార్య 1అర్ధ మగును భర్తయౌ జనునకు
సతియె ఉత్తమ మగు 2సఖియు సుమ్ము.
భార్య మూల మగును 3వర్గత్రయమునకు
పత్ని మూలముననె పతి 4తరించు. 91

తా॥ భార్యను 'అర్ధాంగి'యని అందురు. అనగా భర్త శరీరములో భార్య సగభాగము. సంసారజీవితములో భార్యాభర్తలు సమాన భాగస్వాములన్నమాట. అట్టి భార్యయే భర్తకు సర్వోత్తమమగు స్నేహితురాలు. భర్త ధర్మము, అర్థము, కామము అను మూఁడు పురుషార్థముల (త్రివర్గము)ను పొందుటకు భార్యయే మూలము. అట్లే భర్త సంసారసాగరమును తరించుటకు భార్య మూలకారణము.

సం॥ అర్ధం భార్యా మనుష్యస్య భార్యా శ్రేష్ఠతమః సఖా,
భార్యా మూలం త్రివర్గస్య భార్యామూల స్తరిష్యతి.

ఆ. వె. కారణంబు వలనఁ గల్గుచుండును 1మైత్రి
కారణంబువలనఁ గల్గు 2పగయు,
కాన 3ధీరజనులు 4కడఁక 5వైర ముడిగి
ప్రీతిఁ జెలిమి నెపుడు పెంచవలయు. 92

తా॥ లోకమున నేదో యొక కారణముచేతనే చెలిమిగాని. విరోధముగాని కలుగుచుండును. కాబట్టి విద్వాంసులైన జనులు పూనికతో వైరమును విడిచి ప్రీతితో స్నేహమును పెంచుకొనవలెను.

సం॥ కారణా న్మిత్రతాం యాతి, కారణాద్యాతి శత్రుతామ్,
తస్మా న్మిత్రత్వ మేవాత్ర యోజ్యం వైరం న ధీమతా.

---

91-1. సగభాగము 2. స్నేహితురాలు 3. ధర్మ-అర్థ-కామములను వర్గత్రయమందురు. 4. సంసారసముద్రమును దాటును. 92-1. స్నేహము 2. విరోధము 3. ప్రాజ్ఞులు (తెలిసినవారు) 4. ప్రయత్నముతో 5. పగ.

ఆ. వె. జనుల [1]కొం డొకలకుఁ జను మైత్రి [2]మేల్ సేఁత,
జంతు [3]విహగమైత్రి [4]హేతుగతము.
మూర్ఖజనుల మైత్రి పొసఁగు లోభభయాల
జరుగు దర్శనమున సాధుమైత్రి. 93

తా॥ జనులకు మేలుచేయుటనుబట్టి పరస్పరము స్నేహమేర్పడును. జన్తువులకును, పక్షులకును నిమిత్తమాత్రమున మైత్రి కుదురును. లోభమో, భయమో కారణముకాఁగా మూర్ఖులకు చెలిమికలుగును. పరస్పరదర్శన మాత్రమున సజ్జనులు మిత్రులగుదురు.

సం॥ ఉపకారాచ్చ లోకానాం నిమిత్తా న్మృగపక్షిణామ్,
భయాల్లోభాచ్చ మూర్ఖాణాం మైత్రీ స్యాద్దర్శనాత్ సతామ్.

ఆ వె. [1]ఖలుఁడు మట్టికుండవలె [2]సుఖభేద్యుఁడౌ
కుండ పగుల మఱలఁ గూర్పరాదు.
[3]కనక మట్లె సుజనుఁ గష్టమౌ [4]భేదింప
కడఁగి కూర్ప నెంతొ సులభమౌను. 94

తా॥ మట్టికుండను పగులగొట్టుట సులభము. పగిలిన కుండను తిరిగి అతుకుట సాధ్యముకాదు. అట్లే దుర్జనులను భేదించుట(విడగొట్టుట) సులభము. కలుపుట కష్టము. బంగరు పాత్రను పగులగొట్టుట కష్టము. అతుకుట సులభము. అట్లె సుజనులను భేదించుట కష్టము. కలుపుట సులభము.

సం॥ మృద్ఘట ఇవ సుఖభేద్యో దుస్సంధానశ్చ దుర్జనో భవతి,
సుజనస్తు కనకఘట ఇవ దుర్భేదః సుకరసంధిశ్చ.

---

93-1. ఒకరికొకరు 2. మేలుచేయుటచే 3. పక్షుల స్నేహము 4. ఒక తాత్కాలిక కారణముచే ఏర్పడును. 94-1. దుర్జనుఁడు 2. కష్టములేకుండ విడగొట్టఁదగినవాఁడు 3. బంగారము 4. విడఁగొట్టుటకు.

ఆ. వె. [1]వ్యర్థ మౌను శిశువు బ్రదుకు తల్లియె లేక
[2]ప్రియుల యౌవనంబు [3]వృథ [4]వియుక్తి
వ్యర్థ మౌను తపము పరమశాంతియె లేక
[5]భుక్తి వ్యర్థమౌను పులుసు లేక. 95

తా॥ తల్లి లేనియెడల శిశువుయొక్క బ్రదుకు వ్యర్థమౌను. భార్యా భర్తలలో ఏ యొకరు లేకున్నను మిగిలినవారి యౌవనము వ్యర్థమౌను. మనశ్శాంతియే లేకున్న తపస్సును వ్యర్థమే. పులుసు అను పదార్థము లేకున్న భోజనముకూడ నిష్ప్రయోజనమే.

సం॥ మాతృహీన శిశుజీవనం వృథా, కాంతహీన నవయౌవనం వృథా,
శాంతిహీన తపసః ఫలం వృథా, తింత్రిణీరస విహీనభోజనం వృథా.

ఆ. వె. జలమునందు నూనె, ఖలులందు [1]గుహ్యంబు
తనరు పాత్రు నందు దాన మదియు,
[2]ప్రాజ్ఞునందు [3]శ్రుతియుఁ బరికింప ధరణిలో
వస్తు శక్తిఁ బట్టి [4]విస్తరించు. 96

తా॥ నీటిలో బడిన నూనెబొట్టు, దుష్టులకుఁ దెలిసిన రహస్యము, యోగ్యునకిచ్చిన దానము, విద్వాంసుఁడు నేర్చిన శాస్త్రము బాగుగా విస్తరించును. ఆయా వస్తువుయొక్క సహజశక్తినిబట్టి అయ్యవి విస్తరించుచుండును.

సం॥ జలే తైలం, ఖలే గుహ్యం, పాత్రే దాన మనాగపి,
ప్రాజ్ఞే శాస్త్రం స్వయం యాతి, విస్తారం వస్తుశక్తితః.

---

95-1. నిష్ఫలము 2. భార్యాభర్తల 3. వ్యర్థము 4. వియోగము (ఎడబాటు)చే 5. భోజనము. 96-1. రహస్యము 2. విద్వాంసునియందు 3. శాస్త్రము 4. విపులమగును (వ్యాపించును).

ఆ. వె. [1]ఆతతాయి యయ్యు [2]నాగమించెడు వాఁడు
వృద్ధుఁడైన, [3]బాల బోద్ధలైన
[4]ప్రథితశాస్త్రవిదుఁడు బ్రాహ్మణుండైనను
[5]శంక వీడి, పూని, చంపవలయు. 97

తా॥ లోకమున జనులను చంపఁబూని వచ్చుచున్నవాఁడు వృద్ధుఁడైనను, బాలుఁడైనను, గురువైనను తుదకు ప్రసిద్ధ శాస్త్రవేత్తయగు బ్రాహ్మణుఁడైనను సందేహమును విడిచి తానే వానిని చంపఁబూనవలెను.

సం॥ గురుం వా బాలవృద్ధౌ వా, బ్రాహ్మణం వా బహుశ్రుతమ్,
ఆతతాయిన మాయాన్తం హన్యాదేవావిచారయన్.

ఆ. వె. విప్రులందు [1] జ్ఞానవృద్ధిచే జ్యేష్ఠుఁడౌ
[2]క్షత్రులందు శౌర్యశక్తిచేత.
తనరు వైశ్యులందు ధనధాన్యవృద్ధిచే
పరఁగు శూద్రులందు వయసుచేత. 98

తా॥ విప్రజనులలో జ్ఞానమును బట్టియు, క్షత్రియులయందు పరాక్రమమును బట్టియు, వైశ్యులందు ధనము, ధాన్యముల సమృద్ధిని బట్టియు శూద్రులందు వయస్సునుబట్టియు జ్యేష్ఠుఁడు (పెద్ద) అని చెప్పఁబడు చుండును.

సం॥ విప్రాణాం జ్ఞానతో జ్యేష్ఠ్యం, క్షత్రియాణాం తు వీర్యతః,
వైశ్యానాం ధనధాన్యతః, శూద్రాణామేవ జన్మతః,

97—1. (జనులను) చంపఁబూనినవాఁడు 2. వచ్చుచున్న 4. బాలుఁడైనను, వృద్ధుఁడైనను 4. ప్రసిద్ధ శాస్త్రవేత్తయౌ 5. సందేహము. 98-1. జ్ఞానము యొక్క అతిశయముచే 2. క్షత్రియులయందు.

ఆ. వె. విద్య, వపువు నరయ విభవంబు నలరంగ
వాక్కు, వస్త్ర మనఁగ వఱలునట్టి
[1]వాదు లైన యైదు వస్తువు లమరంగ
[2]మహితపూజ లందు మనుజవరుఁడు. 99

తా॥ ఇచట విద్య, వపువు (దేహము), విభవము (సంపద), వాక్కు, వస్త్రము అని వకారముతో నారంభమగు పదము లైదు గలవు. ఈ యైదు పదార్థములు ఏ నరున కమరునో ఆ నరుఁడు లోకములో గొప్ప పూజలు పొందగలఁడు.

సం॥ విద్యయా, వపుషా, వాచా, వస్త్రేణ విభవేన చ,
వకారైః పంచభి ర్యుక్తః నరో భవతి పూజితః.

ఆ. వె. [1]శుభము గోరు నెవఁడు, [2]సుఖదబంధు వతఁడె
పెంచి [3]కాచు నెవఁడు [4]పిత యతండె.
నమ్మ [5]నర్హుఁ డెవఁడొ, నరులసఖుఁ డతండె
సుఖము గూర్చు నెవతె, [6]సుసతి యామె. 100

తా॥ లోకమందు ఒకని శుభము నెవఁడు కోరునో అతనికి అతఁడే సుఖము నిచ్చు బంధువు అనఁదగును. ఆహారాదులచే పెంచి, బాధల తొలఁగించి ఎవఁడు రక్షించునో అతఁడే తండ్రి యనదగినవాఁడు ఎవఁడు విశ్వసించుటకు యోగ్యమైనవాఁడో అతఁడె నిజమగు మిత్రుఁడు. ఏ భార్య భర్తకు సుఖమును కల్గించునో ఆమెయే మంచి భార్య.

సం॥ స బంధుర్యో హితేషు: స్యాత్, స పితా యస్తు పోషకః,
స సఖా యత్ర విశ్వాసః సా భార్యా యత్ర నిర్వృతిః.

---

99-1. వకారము మొదటగలవియగు 2. గొప్ప సత్కారములు.
100-1. మేలు 2. సుఖమును కల్గించు 3 బాధల తొలఁగించి కాపాడు 4. తండ్రి 5. యోగ్యుఁడు 6. శ్రేష్ఠమైన భార్య.

# సవరణలు

| పుట | పద్యం. | పంక్తి | |
|---|---|---|---|
| 7 | 11 | 4 | అమరు అందు విజయ మసురు లరుమ |
| 9 | 11 | 3 | ప్రోటి బాలిక హృదయంబ |
| 9 | 12 | 1 | ఆర్యముని నుండి ఆరోగ్య మందవలయు |
| 16 | 26 | 3 | అయిన నన్నివు వాత్సల్య మలరఁగాతు |
| 24 | 48 తరువాత "అన్నదాన ..నుండి...పరగదెందు" తొలగింపబడినది | | |
| 37 | 65 | 3 | .... .... పాము విష మెనఁగు |
| 42 | 75 | 5 | .... ... చెనఁటి గురుల, కౌట. |
| 54 | టీకలో | 2 | పుట్టిన స్త్రీలకు |
| 86 | 64 | 3 | .... .... కథిత మగుచు నుండు. |

## సంస్కృతాంధ్రాధ్యాపకత్వము

1. శ్రీ సంస్కృతోన్నత పాఠశాల, శ్రీ వ్యాసాశ్రమము,
   ఏర్పేడు, చిత్తూరు జిల్లా, 1943-44
2. శ్రీ సంస్కృతాంధ్ర హిందీ మహావిద్యాలయము.
   పాలపర్రు, పెదనందిపాడు మండలము, గుంటూరుజిల్లా 1944-45
3. గుంటూరు జిల్లా పరిషత్ హైస్కూళ్ళు
   1. కొల్లూరు 2. ఇంటూరు 3. రేపేంద్రపాడు 4. గోవాడ
   5. జంపని 6. దుగ్గిరాల 7. గారపాడు 8. పెదరావూరు 1945-1972
4. శ్రీ గోగినేని కనకయ్య ఓరియంటల్ కాలేజ్
   తాడికొండ, గుంటూరు జిల్లా 1972-1981

గౌరవ సంస్కృతాంధ్రాధ్యాపకత్వము

5. శ్రీ అనంగానంద వేదాంత కళాశాల, శ్రీ వ్యాసాశ్రమము,
   ఏర్పేడు, చిత్తురు జిల్లా 1981-1988
6. ప్రియదర్శినీ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజ్ 1988-1992
   ప్రసాదంపాడు, ఏలూరురోడ్. విజయవాడ.

### మా ప్రచురణలు :

1. బాలశతకము ముద్రితము 2. సూక్తి సుధాకరము ప్రస్తుతగ్రంథము

మా రాబోవు ప్రచురణలు : 1. సూక్తి సుధాకరము 3,4,5,6,7,8,9,10 భాగములు 2. శాకుంతల సూక్తులు 3. (భర్తృహరి) నీతి శతకము 4. విద్యార్థి 5. విద్యాలయము 6. బాలచంద్రాలోకము 7. తర్కసంగ్రహము 8. ప్రబోధము 9. దివ్యస్మృతులు 10. మానవుడు 11. స్వతంత్ర భారతము-తత్ఫలితము 12. ఆంధ్ర ప్రశ్నోత్తరి 13. ఆంధ్ర వేదాన్తడిండిమము 14. ఆంధ్ర వేదాన్తసారము 15. భగోళదీపిక 16. ఖండకృతులు 1,2,3, భాగములు 17. సంస్కృత వైశిష్ట్యము 18. వ్యాసావళి 19. ప్రాచీనభారత విజ్ఞానశాస్త్ర వైశిష్ట్యము 20. జలార్గళశాస్త్రము